

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

వెల 4 అణాలు ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY 21-6-1



ఇండోనేషియా ఫెడరల్ పార్లమెంటులో పండితనెహ్రూ 19 నిమిషాలు ఆశువుగా ఉపన్యసిస్తున్నారు. ప్రధానిహట్టా ప్రక్కనఉన్నారు.

## ఇండొనీషియాలో నెహ్రూ

మర్డేకా భవనంలో విందు : పండిత నెహ్రూకు ఎదురుగా డా॥ సుకర్నో, ఎడమప్రక్కన సుకర్నో సతి, ప్రధాని హట్టా కూర్చున్నారు.



# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

ఒరులేయవి యొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము **42**
సంచిక **42**

వికృతి సంవత్సర అధికాషాఢ శుద్ధ షష్ఠి బుధవారము



జాకార్టాలోని "మర్దేకా రాజమందిరంలో" సోకర్నో దంపతులకు అతిథులుగా ప్రధాని నెహ్రూ, ఆయన కుమార్తె ఇందిరాగాంధీ.




# ఆంధ్రపత్రిక

1950-వ సం॥ జూన్ నెల 21-వ తేది బుధవారము


## రేషనుప్రమాణము తగ్గించు నిర్ణయం

"ఏవో కొన్ని అసౌకర్యములను అనుభవింపక తప్పదు. అట్టి అసౌకర్యముల నివారించుట సాధ్యము గాదు. కనుక ఆ అసౌకర్యములను సాధ్యమైనంత వరకు తగ్గించుటకు, వీలైనంత తక్కువబాధాకరముగ నుండునట్లు చేయుటకు మాత్రము మనము ప్రయత్నింప వలసియుండును." రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ కుమారస్వామిరాజాగారు ఆహారసలహాసంఘ సభ్యులకు ఇచ్చిన ఈ సలహాను సంఘసభ్యులు తిరస్కరించుటకు వీలులేదు. దేశమునందలి స్థితిగతులను గ్రహించి, అంగీకరించుటకును సాధ్యము గాదు.

క్షామప్రమాదమును నివారించుటకు ముఖ్యమంత్రి చేసిన నాలుగు సూచనలలో ఏ ఒక్క సూచననో గాక, అన్ని సూచనలను అంగీకరింపవలసియుండును. ఎనిమిదిఔన్సుల బియ్యము రేషనుప్రమాణమును ఏడు ఔన్సులకు తగ్గించుట తప్పనిసరి యని గతవారము రాష్ట్రఆహారమంత్రి తెలిపిన వివరములవల్లనే స్పష్టమైనది. కేంద్రప్రభుత్వము చేసిన వాగ్దానముప్రకారము ఆహారధాన్యములు రాకున్న ఆరు ఔన్సులకు కూడ బియ్యము రేషన్‌ను తగ్గింపవలసిన పరిస్థితులు ఏర్పడునని కూడ **శ్రీరోష్ విక్టోరియాగారు హెచ్చ**రించియుండిరి. మూడు సంవత్సరముల క్రితము ఇలాంటి పరిస్థితులే ఏర్పడియుండెను. బియ్యము రేషనుప్రమాణమును ఆరు ఔన్సులు చేసిరి ప్రజలు ఆ అసౌకర్యములనుకూడ సహించిరి. ప్రభుత్వమునకు అన్ని పరిస్థితులలోను వినియోగదారుల సహకారము లభించుచునె యుండెను ఆహారపదార్థముల కొరతను సహించిరి. అధికధరలను భరించిరి. నే డేర్పడిన విషమపరిస్థితులందు కూడ ప్రభుత్వమునకు వినియోగదారుల సంపూర్ణసహకారము లభించుచునె యుండును. కాని అందువలన ఆహారకొరత సమస్య శాశ్వతముగ, స్థిరముగ పరిష్కారము గాదు.

పారిశ్రామికవస్తూత్పత్తిదారులు, ఆహారధాన్యముల పంటదారులు ప్రభుత్వముతో సహకరించి ఉత్పత్తిని అధికము చేసినగాని ఆహారవస్త్రసమస్యలు శాశ్వతముగ పరిష్కారము కాజాలవు. ఇప్పటికిని రాష్ట్రమునం దనేకప్రాంతములందు వ్యవసాయము వర్షపాతముపైననే ఆధారపడియున్నది. కొన్ని ప్రాంతములందు ఇతరజలాశయము లున్నను వర్షాభావమువలన సేద్యమునకు సంబంధించిన పరిస్థితులు సర్వత్ర ఒకేవిధముగ నున్నవి. నూతులద్వారా సాగుపద్ధతిని వృద్ధిచేయవలెనని ప్రభుత్వము సంకల్పించి రెండు సంవత్సరములైనది. రైతులకు రాష్ట్రప్రభుత్వములు ధనసహాయము చేయుచుండెను. కాని మధ్యలో ఈ కార్యక్రమమును విరమింపవలెనను ఆలోచన వచ్చెను. విరమించుటకే చెన్నరాష్ట్రప్రభుత్వము నిశ్చయించెను. ప్రభుత్వవిధానము ఇట్లు అనిశ్చితముగ నుండుటవలననే ఏ కార్యక్రమము ఫలప్రదమగుటలేదు. లేకున్న దాదాపు అయిదు సంవత్సరముల క్రితము ప్రారంభమైన సస్యాభివృద్ధికార్యక్రమ ఫలితములు నేటివరకు అనుభవమునకు రాకపోవుటకు గల కారణము లేమి ?

తత్క్షణఫలితములకు ఆశపడి దీర్ఘకాలికప్రణాళికలన్నింటిని నిరవధికముగ వాయిదావేసి, స్వల్పకాలికప్రణాళికలపైననే యావత్తు ధనమును, శక్తిని వినియోగించుచు వచ్చిరి. ప్రయత్నమునకు తగిన ప్రతిఫలము లభింపలేదు.

ఇప్పటికిని చెన్నరాష్ట్రప్రభుత్వము ఒక నిర్దిష్ట **కార్యక్రమమును, ఖచ్చితమైన విధానమును అనుసరిం**

చుట అవసరము. మొన్న బుధవారము నగరములో సమావేశమైన ఆహారసలహాసంఘసభ్యులకు ప్రభుత్వము అందచేసిన వివరములనుబట్టి ఇప్పటికిని ప్రభుత్వము స్వల్పకాలికప్రాజెక్టులపైననే ఎక్కువగ తమ దృష్టిని కేంద్రీకరించుచున్నట్లను, 1951-52 ఆఖరుకు ప్రభుత్వము సంకల్పించిన 231 స్కీములు పూర్తియై వారి అంచనాప్రకారము 1, 71, 299 ఎకరములు సాగై 63, 621 టన్నులు పండినప్పటికి ఈరాష్ట్రము ఆహారధాన్యముల విషయమున స్వయంసమృద్ధము కాజాలదు. ప్రజలు ఎంతోకాలము ఈ తక్కువ రేషనుపై నుండజాలరు. ఎప్పటి కప్పుడు అప్పటి సమస్యల పరిష్కారమునకు తాత్కాలికఉపాయముల అన్వేషణకు తాపత్రయపడుటకంటె స్థిరపరిష్కారమునకు మార్గముల నన్వేషించిన ప్రజలకు విశ్వాస మేర్పడును. తక్కువ రేషనుతో కాలక్షేపముచేయుటకు సమ్మతింపగలరు. ఇప్పటికి ఏడెనిమిది సంవత్సరములుగ ఈ ఆహారకొరత ఇదేవిధముగ నున్నది. అప్పట్నుండియు ప్రభుత్వము సస్యాభివృద్ధిపథకములను కొనసాగించుచుండెను. ఫలితముమాత్రము అప్పటికి ఇప్పటికి ఒకేవిధముగ నున్నది. కనుకనే ప్రజలకు ప్రభుత్వము సంకల్పించిన పథకములు ఫలప్రదమగునని, ఈ ఆహారసమస్య పరిష్కారమై త్వరలోనే మామూలుగ పూర్తిరేషను లభింపగలదని నమ్మకము కలుగుటలేదు. అట్టినమ్మక మున్నగాని ప్రజలు ప్రస్తుత అసౌకర్యములను సహింపజాలరు. ప్రభుత్వము ప్రస్తుత విషమస్థితిని తొలగించుట కెట్టి చర్యలు తీసుకొన్నను ప్రజలకు ఈ నమ్మకము కలుగునట్లు చూడవలెను.

## రాష్ట్ర వస్త్ర వ్యాపారుల మహాసభ తీర్మానములు

ప్రజల నిత్యావసరవస్తువులపై ప్రస్తుతమున్న కంట్రోల్సును తొలగింపరాదని రాష్ట్ర కేంద్రప్రభుత్వములు పట్టుదలగ నున్నవి. పారిశ్రామికులు, పంటదారులు, వ్యాపారస్థులు అన్ని కంట్రోల్సు రద్దుకావలెనని అంత పట్టుదలగ నుండిరి. ప్రభుత్వము కంట్రోల్సును రద్దుచేయుట ప్రమాదకరమని కంట్రోల్సును తొలగించిన కాలమున పారిశ్రామికులు, వ్యాపారస్థులు అనుసరించిన విధానముల పేర్కొని నిరూపించుచుండెను. వ్యాపారస్థులు కంట్రోల్సుతొలగుటవలన వస్తువుల ధరలు పెరిగిపోలేదని వాదింపలేకుండిరి. అట్టి పెరుగుదలకు తమ బాధ్యతలేదని ఋజువు చేయలేకుండిరి. తిరిగి ఇపుడు వారి తీర్మానములను గౌరవించి కంట్రోల్సును తొలగించిన గతచరిత్ర పునరావృత్తము కాదని హామీ నివ్వలేకుండిరి. కేంద్రప్రభుత్వ పరిశ్రమల శాఖామంత్రి శ్రీ హరికృష్ణమెహతబ్ గారు కంట్రోల్సును తొలగించిన వస్త్రములధరలు హెచ్చవని ప్రజలకు అవసరమైన సరుకులు న్యాయమైన, సరసమైన ధరలకు లభింపగలవని పారిశ్రామికులును వర్తకులును హామీ నిచ్చినచో ఆ క్షణములోనె కంట్రోల్సును రద్దుచేయగలనని ప్రకటించిరి. కేంద్రవస్త్ర సలహాసంఘమున సభ్యులుగ నున్న వస్త్రపారిశ్రామికులుగాని, వస్త్రవ్యాపారులుగాని అట్టి హామీని ఇవ్వలేకుండిరి. మొన్న ఇ. వి. సుందరరెడ్డిగారి అధ్యక్షతను నగరములో సమావేశమైన రాష్ట్రవస్త్ర వ్యాపారులు కూడ కేవలము కంట్రోల్సు తొలగవలెనని ఉద్ఘోషించిరేగాని, కంట్రోల్సు తొలగినఅనంతరము "బీభత్స" పరిస్థితులు ఏర్పడవని చెప్పలేకపోయిరి.

ఈ సమావేశమునందు రాజధానియందలి అనేక ప్రాంతములకు చెందిన చిల్లరవ్యాపారస్థులు, వాణిజ్య సంస్థల ప్రతినిధులు పాల్గొనియున్నందున ఈ సభాతీర్మానములను, ఉపన్యాసకులు వెల్లడించిన అభిప్రాయములను కేవలము విషయపరిజ్ఞానము లేనివారి ప్రసంగములని త్రోసివేయుటకు వీలులేదు. మహాసభవారు కంట్రోల్సును తొలగించవలెనని తీర్మానము చేయుటేగాక, సమావేశమునందు పాల్గొన్న వారందరు "కంట్రోల్సు తొలగినగాని వస్త్రపరిశ్రమ వృద్ధి కాదని దేశమునం దేర్పడిన వస్త్రసమస్య పరిష్కారము కా" దని ప్రకటించిరి. కాని ఎవ్వరుకూడ కంట్రోల్సును తొలగించుటకు అనుకూలమైన పరిస్థితులు ఏర్పడినవని సహేతుకముగ నిరూపింపలేకపోయిరి. ఈ మహాసభ కార్యక్రమమును పరిశీలించిన కంట్రోల్సును తొలగించుటె ప్రమాదకరమని స్పష్టముకాగలదు. సభాధ్యక్షులు శ్రీ సుందరరెడ్డిగారు వ్యాపారస్థులకు కంట్రోల్సు అమలుజరుగువిధానమునుగురించి ఎట్టి ఆక్షేపణలు లేవని, ఈ రాష్ట్రమున కంట్రోల్సు అమలుజరుపు అధికారులతో వ్యాపారుల సంబంధములు చాల సంతృప్తికరముగ నున్నవని వెల్లడించిరి. విదేశీద్రవ్యమును

ఆర్జింపవలెనను ఆశతో భారతప్రభుత్వము విదేశములకు ఎగుమతిచేయుటకు వస్త్రపారిశ్రామికులకు సంపూర్ణస్వేచ్ఛ నిచ్చెనని, అందువలన దేశమునందు వస్త్రము కొరతవడి ధరలు అధికముగ నుంటున్నవని పలువురు సూచించిరి. వీరందరు కంట్రోల్సుఅనిష్టములను గురించికంటె మిల్లులు ఉత్పత్తిచేయు సరుకులో మూడవవంతు తమవద్ద నుంచుకొని తమ కిష్టమువచ్చిన వారికి విక్రయించుటకు ప్రభుత్వము అనుమతించినందుకు ఎక్కువ అసంతృప్తిని వెల్లడించిరి. లాభము ఇదివరలో నూటికి ఇరువదిరూపాయ లుండగ, 1949 లో ఈ లాభమును పదునాలుగు రూపాయలు తగ్గించినందువలన చిల్లరవ్యాపారులకు నూటికి నాలుగు రూపాయలు మాత్రమె లాభ ముంటున్నదని అమ్మకాలపన్ను క్రిందనె దాదాపు ఈ లాభమంతయు వినియోగమగుచున్నదని వీరు వాదించిరి. వస్త్రముల ధరలు పెరగక, ఈ లాభమును పెంచుట సాధ్యముగాదు. చిల్లర వ్యాపారస్థులకు న్యాయమైన లాభము మిగులకున్న అసలు వ్యాపారమునకె ముప్పు ఏర్పడగలదు. కనుక రాష్ట్రప్రభుత్వములు ఈ సమావేశము సూచించినట్లు ప్రజల నిత్యావసరములలో నొకటైన వస్త్రముపై విక్రయపన్నును తొలగించుట ఒక్కటె ఈ పరిస్థితులను చక్కచేయుటకు గల మార్గము.

ఈ రాష్ట్రవస్త్రవ్యాపారుల మహాసభవారు చేసిన మరి రెండు తీర్మానములను కూడ ప్రభుత్వము శ్రద్ధగ పరిశీలించి, సాధ్యమైనంతవరకు ఆ తీర్మానములను అమలుజరుపవలెను. ఇందొకటి కేంద్ర వస్త్రసలహాసంఘముమాదిరిగ రాష్ట్రమునకూడ అట్టి సంఘమును ఏర్పాటుచేయుటకు ప్రభుత్వమునకు ఎట్టి అభ్యంతరము ఉండనవసరములేదు. అధ్యక్షుడు సుందర రెడ్డిగారు సూచించినట్లు ఎప్పటికప్పుడు రాష్ట్రమునందలి వస్త్రపరిస్థితిని సింహావలోకనము చేయుచున్నచో పరిస్థితులకు తగిన విధానమును అనుసరించుటకు వీలుగ నుండును. ప్రభుత్వమునకు వర్తకులకును, వినియోగదారులకును ఉత్పత్తిదారులకును ఒకరి సమస్యల నొకరు అవగాహనచేసుకొనుటకు అవకాశము ఏర్పడును. ప్రభుత్వనిర్ణయములను అమలుజరుపుట సులభమగును.

టోకువ్యాపారస్థుల విధానమువలన చిల్లర వ్యాపారులు పడుచున్న ఇబ్బందులు తొలగవలెనన్న ఇతరరాష్ట్రములనుండి రావలసిన వస్త్రమును ప్రభుత్వమే కొని చిల్లరవ్యాపారులకు పంపకము చేయవలసియుండును. అపుడు టోకువ్యాపారస్థులు విధించిన రెండువారముల గడువును పెంచవలసిన అవసరము లేకపోవుటేగాక ఇతర ఇబ్బందులు కూడ తొలగిపోగలవు.

రాష్ట్రపారిశ్రామికమంత్రి సమావేశమునకు హాజరై వీరి తీర్మానము లన్నింటిని గమనించియున్నందున రాష్ట్రప్రభుత్వ మీ విషయములో తత్క్షణచర్య తీసుకొనగలదని ఆశింపవచ్చును. కంట్రోల్సువిషయమున శ్రీ పెరుమాళ్ళస్వామిరెడ్డిగారు ప్రభుత్వాభిప్రాయమును విస్పష్టము చేసిరి. వా రన్నట్లు ప్రస్తుత పరిస్థితులలో కంట్రోల్సును తొలగించుట ప్రమాదకరమె కాని వస్త్రవ్యాపారులు సూచించిన ఇతర ప్రతిపాదనలను వారు సానుభూతితో విచారించి అవసరమైన చర్య తీసుకొనవలసియుండును. అట్టి చర్యలు ఫలింపవలెనన్న వ్యాపారస్థులును ప్రభుత్వముతో సహకరింపవలెను.

# విషయానుక్రమణిక

## 21 జూన్ 1950

# మనదేశం

## అర్ధాన్నం *

ఆహారపదార్థాల రేషనింగ్ అమలులో ఉన్న ప్రాంతాలన్నిటా రేషన్ పరిమాణంలో బియ్యాన్ని మనిషికి రోజుకి 8 ఔన్సులనుంచి 7 ఔన్సులికి తగ్గించడానికి ఆహారసలహాసంఘం, మద్రాసుప్రభుత్వం నిర్ణయించాయి. మొత్తం రేషన్ 12 ఔన్సులే ఉంటుంది. నాలుగౌన్సులికి బదులు అయిదౌన్సులు గోధుమలు, రొట్టెకాని, రేషన్ షాపులు దయతల్చి ఇచ్చే మరొకపదార్థం కాని ప్రజలు కొనుక్కోవాలి. అంటే వారంరోజులికి తీసుకునే బియ్యంలో ఒకరోజువాటే బియ్యానికి బదులు గోధుమ, వగైరా పదార్థాలలో ఒకటిస్తారన్నమాట.

కొనగల తాహతుకలవారు బియ్యం ఎనిమిదౌన్సులు చాలకపోతే చాటున బియ్యం కొంటూనే వున్నారు. అలా బియ్యం దొరికినా కొనలేక అనేకులు, ముఖ్యంగా కూలినాలి చేసుకునేవారు కానీకీ అరణాకీ వీధుల్లో దొరికే వస్తువులు కొని తింటున్నారు. లేదా పస్తుంటున్నారు. వీరికి నోరులేదు కాబట్టి బియ్యం చాలడం లేదని నాయకులికిగాని పత్రికల్లోగాని మొరపెట్టుకోడం లేదు. తాహతు కలిగి చాటున కొని తింటున్న వారే బ్లాక్ మార్కెట్ బియ్యంధర లధికమైనందువల్ల పదే పదే రేషన్ చాలడం లేదంటారు. కాబట్టే మన దేశంలో ఆహారం రేషనింగ్ విధానాన్ని ప్రభుత్వం సమర్థతతో నిర్వహిస్తున్నదనే అభిప్రాయం బలపడింది. "ఎన్ని చిక్కులొచ్చినా సరే అన్నం లేక ఎవరూ మాడిచావకుండా కాపాడగలుగుతున్నాం" అని ప్రధాని కుమారస్వామి రాజాగారు ఇటీవల అనగలిగారు. దేశంలో పరిస్థితిని వాస్తవంగా చూసినట్లయితే వారామాట అనగలిగేవారు కారేమో.

పశ్చిమగోదావరి, కృష్ణాజిల్లాల్లో ఆకలికి మాడి కొందరు చనిపోయినట్లు ఈమధ్య వార్తలు వస్తున్నా మద్రాసు ప్రభుత్వం ఆవిషయమై ఆట్టే పట్టించుకోలేదు. నిజమని కాని అబద్ధమని కాని చెప్పలేదు. వీళ్లు ఆకలివల్ల చచ్చిపోలేదు, అజీర్ణరోగంవల్ల చచ్చిపోయారు" అని ప్రకటించకపోవడం అదీ కొంత నయమే. మచిలీపట్నం, కొవ్వూరు మొదలైన ప్రాంతాల్లో దుకాణాల్లో బియ్యం దొరకడంలేదని పదిహేనురోజుల క్రిందటే వార్తలు వచ్చాయి. విజయవాడలో అటువంటిది సంభవించినప్పుడు అధికారులేదో వర్తకుల్ని నలుగుర్ని పిలిచి బెదిరించారని మాత్రం తెలిసింది. కాని తరవాత ఏంచేశారో తెలియదు.

అయితే ఒక్కటి మాత్రం తెలుసును. రైల్వే వేగన్ల కొరతవల్ల తాడేపల్లిగూడెం, భీమవరం మొదలైనచోట్ల రవానా కావలసిన బియ్యం నిలవ ఉండిపోయిందని చెప్తూ, అక్కడనుంచి బియ్యాన్నంతనీ కోయంబత్తూరు రామనాథపురం మొదలైన తమిళ జిల్లాలకు తరలిస్తున్నారు. కొవ్వూరులో బియ్యం కొరతగా ఉన్నప్పటికీ, తంజావూరునించి వేగనులు వచ్చేదాకా ఉండాలని ప్రభుత్వం చెప్పకుండా ఉంటేచాలు. ఆజిల్లాలో ఉన్న బియ్యాన్ని ముందుగా ఆ జిల్లాలోని అవసరాలకు మిగిల్చి మిగతా బియ్యాన్నే తరలించడం మంచిది. కృష్ణా జిల్లాలో సేకరించబడిన బియ్యంఅంతా మలబారుకీ, తమిళదేశానికీ ఇదివరకే వెళ్ళిపోయింది. సర్కారు జిల్లాల అవసరాల్ని తీర్చకుండా ఇతరప్రాంతాలకి రవానా చేసెయ్యడంలో ప్రభుత్వం అభిప్రాయం బోధపడ్డం లేదు. బహుశా బ్లాక్‌మార్కెట్ ధరకి కావలసినంత బియ్యం బహిరంగంగా మార్కెట్లలో దొరుకుతుందనీ, బియ్యం కరవై ప్రజలు మాడుతున్నారనే మాట అసత్యమనీ ప్రభుత్వం భావించి ఉండవచ్చును. బ్లాక్ మార్కెట్ ధరలకి బియ్యం దొరికేమాట నిజమే ననుకున్నప్పటికీ, నిజంగా అర్థాకలితో బాధపడుతున్న వారికి అందుబాటులో ఉండదు. అందువల్ల పేదల్లో కొందరు అన్నం లేక చచ్చిపోయారంటే అది బొత్తిగా అబద్ధం అనుకోవలసిన అగత్యం లేదు.

రాష్ట్రప్రభుత్వంఅధీనంలో ఉన్న బియ్యపు నిలకల్ని ఒట్టి ఆట్టే రోజులికి చాలదని అంచనావేసి రేషన్ తగ్గిస్తున్నారు. తగ్గించక అన్యమార్గం లేదని ప్రభుత్వం అన్నది. రెండేళ్లకు తక్కువవయసుగల పిల్లలకు రేషన్లు ఇవ్వడం మానెయ్యాలనే సూచన నిరాకరించబడింది. బియ్యం తీసుకునే వాళ్లనీ, కేవలం గోధుములే తీసుకునే వాళ్లనీ, జొన్నలే తీసుకునేవాళ్లనీ, లేక అన్నిరకాలూ కలిసి తీసుకునేవాళ్లనీ రేషన్ కార్డుహోల్డర్లని విభజించేపద్ధతిని మానాలనే సూచనకూడా నిరాకరించబడింది. రాష్ట్రంలో ఆహారపరిస్థితి ఈరీతిగా ఉన్నందువల్ల భారతప్రభుత్వం ఇదివరకు నిర్ణయించిన మూడులక్షల టన్నులేకాక అదనంగా రెండున్నర లక్షల టన్నుల ఆహారపదార్థాలు ఇవ్వగలదని వాగ్దానం ఇచ్చింది. అయితే ఇదివరలో నిర్ణయించిన 3 లక్షల టన్నుల్లో సగమైనా ఇంతవరకూ రాలేదు. ఇంక అదీ ఇదీ కలిపి విరివిగా పంపగలరన్నారు. అయితే వచ్చేదానిలో గోధుమ అధికంగా ఉంటుంది. ఈరెండున్నర లక్షల టన్నుల అదనపు సప్లైలో లక్షటన్నులు గోధుమ, 30 వేల టన్నులే బియ్యం.

ఇప్పుడు ప్రభుత్వం ఇచ్చిన లెక్కల ప్రకారం మొత్తం నిర్ణయమైన 5½ లక్షల టన్నుల ఆహారపదార్థాలలోనూ లక్షటన్నుల పైగా బియ్యం, లక్షా 80 వేల టన్నుల గోధుమ రావలసిఉన్నాయి. వాస్తవానికి డిసెంబరు నెలాఖరుకు చెన్నరాష్ట్రప్రభుత్వానికి కొదవ (లక్షా 30 వేల టన్నుల బఫర్ స్టాక్‌ను కూడా లెక్కలోకి తీసుకుంటే) 70 వేల టన్నులే. అదీకాక గోదావరిజిల్లాలనుంచి రాగలదాళ్వా పంటనుకూడా లెక్కగడితే, రేషన్ తగ్గించవలసిన అగత్యం కనిపించదు. కేంద్ర ప్రభుత్వంనుంచి ఇకనుంచి ప్రతిమాసం నాగాలేకుండా ఆహారపదార్థాలు సరఫరా కాగలవన్నారు. అదే వాస్తవమయితే రేషన్ని ఏడౌన్సులకి తగ్గించవలసిన అవసరం ఉండదు సరికదా రెండుఔన్సులు గోధుమ హెచ్చించవచ్చు. ఇదంతా చూస్తే సర్కార్లలో కూడా రేషనింగు అమలుజరపాలనే ఉద్దేశంతోనో, లేక మరేఉద్దేశంతోనో కేంద్రప్రభుత్వాన్నీ ప్రజల్నీ బెదిరించి ఈరీతిగా రేషనింగ్ చేస

స్థాయిగా చేయడానికి యత్నిస్తున్నారా అని అనుమానం తోస్తుంది.

ఆహారసలహాసంఘంలోని భూస్వాములు తాము నిలవఉంచుకునే ధాన్యం 16 ఔన్సులలో ఒక ఔన్సు తగ్గించుకోడానికి అంగీకరించినట్టయితే ప్రజల్ని ఏడౌన్సులే ఇచ్చి అర్ధాకలితో ఉంచవలసిన అవసరం లేకపోయేదే. కాని రైతులవోట్లు కావలసిన కాంగ్రెస్ ప్రభుత్వానికి ఈ న్యాయం చేకూర్చే సాహసం లేకపోయింది. రేషన్ తగ్గించక తప్పలేదు.

కాబట్టి ఈసంవత్సరం మళ్లీపంటవచ్చే వరకూ ఏడౌన్సులబియ్యం అయిదౌన్సుల గోధుమ తినడానికి మనరాష్ట్రవాసులు అలవాటుపడాలంటున్నారు. (గోధుమబదులు సెమోలినా, మొక్కజొన్న నిర్బంధంగా నెత్తిమీద రుద్దకుండా ఉండేపక్షంలో) ఈమధ్య ఒక జపాన్ విజ్ఞానపరిశోధకుడు చెప్పిన మాటే నిజమైతే ఇది మన మంచికే అనుకోవాలి. మనదేశంలో ఆహారోత్పత్తి క్షీణిస్తోంటే సంతానోత్పత్తి అధికమౌతోంది. తినే ఆహారంలో వరి అధికంగా ఉన్నందువల్ల సంతానోత్పత్తి అధికమౌతున్నదని ఆపరిశోధకుడు కనిపెట్టాడట. తంజావూరు సర్కారుజిల్లాల్ని చూసినా బెంగాల్‌ని చూసినా ఇది నిజమేననిపిస్తుంది. కాబట్టి మనం గోధుమ వాడకం అధికంగా అభ్యాసం చేసుకోడం మంచిదే. అయితే ఇంకో చిక్కుంది. మనరాష్ట్రంలో గోధుమ పంట లేదు. మనం నిత్యం ఆహారానికి ఉత్తరాదిరాష్ట్రాలపై ఆధారపడ్డం పండిట్ నెహ్రూ సర్దార్ పటేల్ గార్లకి ఇష్టం కావచ్చును కాని తమిళ్నాడు వాసులకి బొత్తిగా ఇష్టం ఉండదు. తమిళులు హిందీ నిరంకుశత్వానికి భయపడినట్లయితే అధికసంతానోత్పత్తికి తలొగ్గక తప్పనిసరి.

## పత్తి ధర పెరుగుదల *

పత్తి గరిష్ఠధర కండి(784 పౌనుల బరువు) రు. 620 నుంచి 770 కి పెంచడంతో దేశం ఆర్థికవ్యవస్థలో పెద్ద మార్పులు రావచ్చును. పాకిస్తాన్‌తో వ్యాపారప్రతిష్టంభన ఏర్పడ్డంతో పాకిస్తాన్ పత్తి రావడం నిలిచిపోయి మన బట్టమిల్లులకి చిక్కువచ్చింది. పొట్టిపింజపత్తితో నూలుమిల్లులు ముతకనూలు తీసుకు తృప్తిపడాలి. ముతకబట్ట, ముతకనూలు అధికంగా తయారుచెయ్యడం మనమిల్లులవారికి కష్టం లేదు. ముతకబట్టకీ ముతకనూలుకీ కూడా అధికధరల్ని ఇస్తేగాని మిల్లుల్ని యజమానులు మూసే ఉంచుతారు. కాబట్టి మన పత్తికొనుబడి ధరని పుట్టి రు 150 పెంచడం తప్ప ప్రభుత్వానికి మన మిల్లుల్ని నడిపించడానికి మార్గాంతరం దొరకలేదు. షోలాపూరు మిల్లుల్ని నడపడానికి ప్రభుత్వం ప్రయత్నించి అర్థంచేసుకున్న విషయం ఇది. దీనికి మిల్లుయజమానులు పత్తి అమ్మకపు ఏజంట్లు ఎంతవరకూ కుమ్మక్కైనారో మనకి తెలియదు. మిల్లుయజమానులికీ పత్తి ఏజంట్లకీ ఇది అఖండవిజయమని చెప్పాలి. ప్రభుత్వానికి వేరే దారి తోచలేదు.

ఇది ఇంతటితో పోదు. ఏడాదికిందటే తయారై మార్కెట్లో పడి మూలుగుతున్న సన్నబట్ట, ముతకబట్ట, నూలుధరలు పెరిగిపోగల అవకాశం ఉంది—ప్రభుత్వం అతిజాగ్రత్తగా ఉంటే తప్ప. ఈజాగ్రత్త అట్టే ప్రయోజనం లేనిదని అనుభవమే. బట్టధర ఎక్కువైనప్పుడు మిగతా వస్తుసామగ్రి ధర అధికం కాక తప్పదు. ఈ పెరుగుదల త్వరలోనే ఆరంభం కావచ్చును. మళ్లీ కూలీలు, కార్మికులు అధిక వేతనాలు కావాలనీ, మధ్యవర్తకులు అధికలాభాలు కావాలనీ, రైతులు ధాన్యానికి అధికధరలు కావాలనీ కోరినా ఆశ్చర్యం లేదు.

## దేశసంపద *

1946-47 లో మనదేశంలో (విభక్త భారత యూనియన్) ఉత్పత్తి కాబడిన సంపద విలువను భారతప్రభుత్వవాణిజ్య శాఖవారు అంచనా వేశారు. అది మొత్తం రు 5580 కోట్లు. అంటే 24 కోట్ల 44 లక్షలమంది పనిచేస్తున్న ప్రజలకీ తలకి ఆదాయం రు 228 కు వచ్చిందన్నమాట. 1946 లో ఇది రు 204. అంటే పెరుగుదల నూటికి 11 వంతులపైన ఉందన్నమాట. అయితే వస్తువులధర నూరింట 12½ వంతులుపైగా పెరిగినందువల్ల ఆదాయం వాస్తవమూల్యం తగ్గిందన్నమాట.

ఇందులో వ్యవసాయంవల్ల ఉత్పత్తియైన ఆహారవస్తువుల విలువ రు. 2002 కోట్లు. పాలు రు. 401 కోట్లు. ఇతరవ్యవసాయ వస్తువుల ఉత్పత్తివిలువ రు. 543 కోట్లు. పరిశ్రమలవల్ల ఉత్పత్తి విలువ రు. 3115 కోట్లు. ఇందులో కుటీరపరిశ్రమలు, గ్రామీణ వృత్తులవల్ల ఉత్పత్తిఅయిన వస్తువుల విలువ రు 1043 కోట్లు.

పరిశ్రమల్లో పనిచేసిన వారి సంఖ్య కోటీ 95 లక్షలు. వ్యవసాయం, పశువుల పెంపకంలో వున్నవారి సంఖ్య 6 కోట్ల 83లక్షలమంది. దీన్నిబట్టి చూస్తే ఒక విషయం బోధపడుతుంది. దేశఆర్థికవ్యవస్థలో సేద్యానికి తగిన ప్రాధాన్యమివ్వబడటం లేదు. ఏటేటా సాగవుతూవున్న భూమి తగ్గిపోతోంది. 1945-46 లో కోటీ 72½ లక్షల ఎకరాలు సాగైతే 1946-47 లో కోటిన్నర లక్షలే సాగయింది. వ్యవసాయఫలమూల్యం పారిశ్రామికఫలమూల్యంకంటె చాల హీనంగా ఉంది. ఈపరిస్థితిమార్చి దేశంలో రైతుల ధనానికి కొనుగోలుశక్తి వృద్ధి అయితే గాని దేశం ఆర్థికంగా కోలుకోవడం అసంభవం.

సీతారామ్)



మద్రాసులో లెదరు టెక్నాలజీ ఇన్స్టిట్యూట్‌లో పరిశోధనాగారం.

# మధుర క్షణాలు



[ప్రఖ్యాత బ్రిటిష్ నవలాకారుడు జె. బి. ప్రీస్ట్లీ రచించిన నూతనగ్రంథం "జీవనమాధుర్యం"నుంచి రీడర్స్ డైజెస్ట్ పత్రిక ప్రచురించిన సంగ్రహం ఆధారంగా ఇది వ్రాయబడింది.]

నాకెప్పుడూ చికాకు అధికమనేమాట నిజమే. అసలు నేనందుకే పుట్టానని నాముఖమే చెప్తుంది. బుగ్గలూ నుదురూ ముడతలు పడి, కిందపెదవి బయటికి వేలాడుతూ ముందుకు ఉబికివచ్చే కనుగుడ్లు, అదే సూచిస్తాయి.

బొంగురుగొంతుకధ్వని మెల్లిగా జీరతో వస్తుంది. ఇది నాకు పోవాలన్నా పోదు. లోకమంతా తిరిగి చికాకుతో సణుక్కున్నాను. సముద్రాలపై ప్రయాణం చేస్తున్నా, నదులు దాటుతున్నా, కొండలెక్కి దిగుతున్నా, ఎడతెగని ఎడారుల్లో ప్రయాణం చేస్తున్నా ఈసణుగుడే నాలో వచ్చేది.

ఇంటిదగ్గర ఎంత సణిగానో రచ్చలోనూ అంతే సణిగాను. మాయింట్లో ఆడవాళ్లకి నేనంటే విసుగు, నిస్పృహ. సణుక్కుంటున్నకొద్దీ పరిస్థితి మరింత అధ్వాన్నమౌతుందని ఆడవాళ్ల అభిప్రాయం కాబోలు. కాని సణుగుడు మేలని నా అభిప్రాయం. హోటల్లో దుర్భరమైన వస్తుసామగ్రి నాకు తినబెడితే, "అబ్బ అవతే పాడుగా ఉన్నాయి. దీనికితోడు నీ సణుగుడేమిటి" అని నన్నంటే ప్రయోజనం లేదు. ఆహారం బాగుండనప్పుడు, కనీసం కసిదీరా వర్ణించడం నామేలుకేనని నావాదన.

నారచనల్లో అత్యధికభాగం ఈ జీవనాన్ని విమర్శించినదే. అంటే అదొకరకం పెద్దసణుగు డన్నమాట. నాపుస్తకాలు చదివినవాళ్లలో చాలమంది "ఈమనిషికి జన్మలో ఎన్నడో ముఖంవిప్పారదల్లే ఉందే" అనుకుని ఉంటాడు. దానికి సమాధానమే ప్రస్తుత రచన.

దాదాపు అర్థశతాబ్దికి పూర్వం నా వయస్సు నాలుగేళ్లుండవచ్చును. వసంత ఋతువులో ఉదయమే గృహానికి సమీపంలో ఒకపొలంలో కూచునేవాడిని. ఏదో విచిత్రమైన నిక్షేపం ఉన్నదనే భావంతో తన్మయత్వం పొందేవాడిని. ఈ అనుభూతి అనిర్వచనీయం. ఆనిక్షేపం నాకోసం భూగర్భంలోనో సువర్ణాగారంజితవియత్తలంలోనో వేచిఉన్నదని భావించేవాడిని. ఆనిక్షేప మేమిటో, ఎటువంటిదో తెలియదు కాని ప్రతిఉదయం తదాకాభావంలో తళతళలాడేది. ఎక్కడో నాకు అందుబాటులోనే నాకోసం గుప్తంగా ఉంది. ఏక్షణంలోనైనాసరే నాహస్తగత మౌతుంది. ఆనిక్షేపం భూదేవతేననీ, కాంతిపుంజమేననీ నాకిప్పుడు ద్యోతకమౌతున్నది. అయినా ఆనిక్షేపంకోసం ఆనాటినుంచి అన్వేషిస్తూనే ఉన్నాను.

సముద్రయానంలో ఓడపై నిలబడి సూర్యోదయాత్పూర్వం పరిసరాల్ని వీక్షించాలి. నాతోపాటు కనుమేర కానగల పరిసరమంతా దీర్ఘసుషుప్తినుంచి మేల్కొంటున్న కవళిక పొడగట్టుతుంది. జడత్వం వదలించి నూతన చైతన్యం పొందుతుంది. లోకంలో కల నవచైతన్య ధృతిఅంతా ఇక్కడే కానవస్తుంది. రాత్రిఅంతా మనకోసమే లోకానికి నూత్నస్వరూపం రచించబడింది. ఉదయభానుని కిరణాలతో కెరటాల అంచులు రత్నఫలకాలవలె ప్రతిబింబిస్తాయి. సరిగ్గా ఈ క్షణంలోనే మహాసాగరం గంభీరఘోషలతో, కెరటాల కలకలలతో కొత్తగా సృష్టించబడినట్లుంది. ఆకాశం ఆవంక నీలివర్ణంలో లేతగా మృదువైన కాంతులతో చిత్రింపబడింది. వాయుదేశమంతా ఏవో అస్పష్ట ఆనంద ఉల్లాసాలతో పొంగుతున్నది. ఎక్కడో సాగరగర్భంనుంచి కవరాని పుష్పగుచ్ఛాల పరిమళం పైపైకి వస్తోంది. అది కాలపురుషునికే ప్రభాత సమయమనిపిస్తుంది.

దుస్తుల్ని గురించి యువతులు చర్చిస్తుంటే పరిశీలించి చూడవలసిందే. ఆప్రత్యేకవిషయ చర్చలో వారి ఏకాగ్రత అపూర్వం. వారి కన్నుల్లో మెరుపులు ఎంతసేపు చూసినా తనివితీరదు. తమనుగురించి తామెంత పరిశీలించి అవగాహన చేసుకుంటారో ఆశ్చర్యంగా ఉంటుంది. పురుషులు తమ ప్రతిబింబాల్ని చూసుకుంటున్నప్పుడు వారి భావాలు చాలా ఉదారంగా ఉంటాయి. ఇతరులు చెప్తున్నంత లావుగా గాని, లేక సన్నగా గాని; వికారంగాగాని మనం ఉండ మనుకుంటాం. స్త్రీల కటువంటి భ్రమ తక్కువ. ఉన్నదున్నట్లుగా స్వీకరిస్తారు ఒకామె భుజాలు ఎత్తుగా ఉంటాయి. ఒకామెచేతులు మరీసన్నని ఒకామెనడుము లావెక్కువ. మొత్తా. కందరిలోనూ ఏవో లోపాలు కనిపించకుండా ఉండవు. కాబట్టి ఆలోపాల్ని కప్పుకోడం

(36-వ పేజీ చూడుడు)



హాస్పేట తాలూకా గరగ గ్రామమున బోయ పెద్ద హనుమంతప్ప అను నతడు కాల్చిచంపిన పెద్దపులి.

కల్పిక:

# కుక్క

శ్రీ

**కొడవటిగంటి కుటుంబరావు**

ఎక్కడెక్కడో తిరిగితిరిగి ఆ కుక్క ఎప్పుడూ మా ఇంటి ముందే పడి ఉంటుంది. మా ఇంటిమీద ఈగవాల నివ్వను. ఇంటిముందుకు బిచ్చగాణ్ణి చేర నివ్వదు. మా తలవాకిలిబండమీద పడుకుని మా ఇంట్లో వాళ్లెవరన్నా లోపలికి వచ్చినా, బయటికి వెళ్లినా, కళ్లుమాత్రమే పైకెత్తి చూసి తోక రాతిమీద అటూ ఇటూ పొర్లిస్తుంది. దానికి ఏజన్మానా ఇంత అన్నపు కరుడు పెట్టి ఎరగం.

"విశ్వాసమంటే అట్లా ఉండాలి," అనే వాడు మానాన్న. ప్రతిఫలం కోరకుండా చూపించేదే విశ్వాసమని ఆయన తాత్పర్యం. అటువంటి విశ్వాసం ఉంచినందుకు ఆ కుక్కను చూసి మానాన్న మెచ్చుకునే వాడు.

కాని మాతాతకు ఆకుక్కలో ఏమీ విశేషం కనిపించేదికాదు. "ఏజన్మానో మన సొమ్మంతా తిని ఉంటుంది. ఈ జన్మలో రుణం తీర్చుకుంటున్నది." అని ఆయన చెప్పే వాడు.

ఆకుక్క మా ఇంట్లోకి అడుగుపెడితే మా నాన్నా కొట్టేవాడు, మాతాతా కొట్టే వాడు. అందుచేతవాళ్లు చూడనప్పుడు నేను తలవాకిటి దగ్గిర దానితో ఆడుకునేవాణ్ణి. దాని ఒంటిమీద చెయ్యివేస్తే మొదట్లో బాగుండేది. కాని రాను రాను బాగా ఉండేది కాదు. ఒకసారి నాచేతికి దాని కురుపులుకూడా తగిలాయి. తరవాత దాన్ని ముట్టుకోటం మానేశాను.

నాకు కురుపులు లేస్తే చాలామందులు వేసారు. కుక్కకు కురుపులు లేస్తే ఎవరూ మందు వెయ్యరు. మందు వేస్తే కుక్కకురుపులు కూడా నయమై దాని బొచ్చు మళ్లీ వెనకటిలాగా అవుతుందేమో.

ఒకసారి ఆకుక్క మాకు గొప్పఉపకారం చేసింది. అది వేసంకాలం. అందరం, ఇంటిల్లిపాదీ, బయట పడుకున్నాం. చీకటి రాత్రి. ఒక రాత్రివేళ తలవాకిలి తలుపు దగ్గిర కుక్కగట్టిగా మొరిగి, తలుపును కాళ్లతో గీరసాగింది. మానాన్న లేచాడు. మాతాతా, అందరమూ లేచాం. మేం లేవటం చూసి దొంగవాడు గోడదూకి పారిపోయి నాడు. వాడు గోడ ఎక్కి లోపలికి దూకటం కుక్క చూసిఉండాలి.

ఆకుక్క చేసిన మేలుగురించి మానాన్న ఎంతమందితో చెప్పాడో లెక్కలేదు, "దానికి మేమెన్నడూ పట్టెడన్నంపెట్టి ఎరగం! విశ్వాసమంటే అట్లా ఉండాలి," అనేవాడు మానాన్న.

వెనకటిలాగే మాతాత, "ఆఁ, ఏజన్మలోనో మనసొత్తు తినివుంటుంది. ఇప్పుడు ఋణం తీర్చుకుంటున్నది." అని అందుకునేవాడు!

ఏమైనా మానాన్నమాత్రం కొంత చలించాడు. కుక్కను లోపలికి రానివ్వసాగాడు. ఎప్పుడైనా - రెండు మూడు రోజులకోసారి - అన్నం మిగిలితే అందరూ తిన్నతరువాత ఇంత పెట్టించేవాడు.

కాని ఏంలాభం? మానాన్న అనుగ్రహం దానిమీద ఎంతపెరిగిందో మాతాత ఆగ్రహం దానికి రెండింతలు పెరిగింది. మెట్లమీదికి వచ్చికూచుందని ఒకరోజు మాతాత దాన్ని కర్రతీసుకొని చావగొట్టాడు. ఇంకోరోజు వంటయింటివాకిలిదగ్గిరికి వచ్చిందని చావ గొట్టాడు. పైపెచ్చు మానాన్నను చివాట్లు పెట్టాడు.

"వెధవకుక్కకు నువే నేర్పావు. దానికి అన్నమెందుకు వెయ్యాలి? తలవాకిలిదాటి లోపలికి అడుగుపెట్టని దాన్ని లోపలికెందుకు రానివ్వాలి? చూడు ఎట్లా నెత్తినెక్కుతున్నదో!"

మానాన్న నీళ్లు నములుతూ, ఆరోజు కుక్క నిద్రలేపకపోతే దొంగలు ఇల్లుదోచుకునేవాళ్లని బయటపడుకున్నవాళ్లకు ఏమీ తెలిసిఉండేదికాదనీ గొణిగాడు.

మాతాత గర్జించాడు. ఈ వెధవకుక్కగాంగా ఇల్లు రక్షించింది లెమ్మన్నాడు. ఈ శని నెత్తికెక్కేకన్న దొంగలుపడి ఇలు దోచుకుపోయినా బాగుండేదన్నాడు.

లోపలికి వచ్చి వరండామెట్లమీద పడుకున్నందుకే, వంటింటి తలుపుదగ్గిర నిలబడి లోపలికి చూసినందుకే మాతాత కుక్కను చావబాదితే మరోరోజు అది ఇంకా గొప్ప అత్యాచారం చేసింది - ఎక్కణ్ణుంచో అన్నపు కరుడుతెచ్చుకుని మాతలవాకిలి పక్కగా ప్రహరిగోడదగ్గిర పెట్టుకు తింటున్నది. ఇది మాతాతయ్య కంటపడింది. ఆయనచేసిన రాద్ధాంతం అంతా ఇంతా కాదు. అది వంటింట్లోనుంచే అన్నంకరుడు ఎత్తుకొచ్చిందన్నాడు. తలవాకిలి తలుపు మూసి దుడ్డుకర్ర తీసుకొని దానివెంటపడ్డాడు. అది కరుడుమాత్రం నోటకరుచుకొని ఆయన్ను దొడ్డిచుట్టూ త్రిప్పింది. కర్రవిసిరేస్తే తప్పించుకున్నది. చివరకు మానాన్నే తలవాకిలి తలుపు తెరిచి దాన్ని తప్పించుకుపోనిచ్చాడు.

తీరా విచారిస్తే అది వంటింట్లో అడుగు పెట్టనేలేదు. వంటింటితలుపు భద్రంగా వేసి ఉంది. అన్నంగిన్నె చక్కగా మూతపెట్టి ఉంది.

కాని ఆకుక్క మళ్లా మాకు కనిపించలేదు. మాదొడ్లోకి అడుగుపెట్టలేదు. మాతలవాకిలిదగ్గిర పడుకోలేదు.

అది వెళ్లిపోయిన నెలరోజుల్లోగానే మాఇంట్లో దొంగలు పడ్డారు. మాతాతకోరిక ఫలించింది.

ఎందుకో నాకూ ఆనందమే కలిగింది.

---

నవల:




శ్రీ నోరి నరసింహశాస్త్రి

## 36

* "భీష్మద్రోణతటాం జయద్రథజలాం గాంధారరాజహ్రదాం
కర్ణద్రౌణికృపోర్మినక్రమకరాం దుర్యోధనస్రోతసమ్
తీర్ణః శత్రునదీం శరాసిసికతాం యేన ప్లవే నార్జునః
శత్రూణాం తరణేషు వః సభగవా నస్తు ప్లవః కేశవః"

సూత్రధారుడు ప్రవేశించుచునే యీ మంగళశ్లోకము పఠించెను. అది చదువుచుండగనే గోదావరిపండితు లొకరిమొగము లొకరు ఒక్కక్షణమాత్రము చూచుకొనిరి.

'నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశింపవలసినది; సూత్రధారుడే నాందీశ్లోకము చదువుచున్నాడేమి?'

'ఇది కేరళదేశాచారము కావచ్చును.'

'అక్కడ నెన్నియో విపరీతాచారములు కలవని జనప్రథ కలదుగదా! ఇదియు నట్టివానిలో నొకటి కావచ్చును.'

ఇట్లనుచు వారు సగిరెట్టుకొనుచుండిరి.

అంతలో నా శ్లోకము సమాప్తమయినది. దానితో వారికి ముందు కలిగిన సందేహము లన్నియు తీరిపోయినవి. సభయంతయు నొక్కమారుగా వికసించినది. అంతవరకును ఈ సమయమున అమంగళనామము గల ఊరుభంగము ప్రదర్శించుట యేమి యని యందరు శంకించినవారే! ఇప్పుడా సభలోనే ఆ మంగళశ్లోకార్థము అవగతము కాగానే, సాధు సాధు స్వనము లెలువడినవి. 'సాహిత్యరత్నాకరుడుగనుకనే రాజసింహు డీనాడు ఈ రూపకప్రదర్శనము చేయ నాజ్ఞాపించెను. వసిష్ఠగోదావరి నీత డుత్తరింపవలసియున్నాడు, రెండు శత్రువాహినుల నుత్తరింపవలసి యున్నాడు, పాపము!'

వా రా మంగళశ్లోకములోని యాశీర్వచనముతో నేకీభవింపనూ లేదు; దానిని కాదననూ లేదు.

సూత్రధారుడు, 'ఆర్యమహాశయులకు ఒక మనవి...... అరే, ఏమి టిది, ఏదో కోలాహలముగా వినబడుచున్నది!' అనెను.

ఇట్లాతడనుచుండగనే నిజముగా అవల రణరంగమునుండి యుద్ధకోలాహలమే వినవచ్చెను. ఇట్లావల నిజముగా యుద్ధము జరుగుచున్న సమయముననే ఈ నాటకప్రదర్శనము చేయుటచే, నాట్యవస్తువు సత్యముగా నప్పుడు జరుగుచున్నదా యన్నట్లు గట్టిగా భాసింపజేసెను. సూత్రధారుడును పారిపార్శ్వకుడును తమ సంభాషణలో కురుపాండవుల మహాయుద్ధపు నంత్యదశను వర్ణించిరి.

"ఈ వీరపురుషులందరు ఎందు కిలా సంభ్రమముతో పరిభ్రమించుచున్నారు?......అన్యోన్యాయుధప్రహారములతో మత్తదంతావళదంతాభిఘాతములతో గాయపడి, నెత్తుగోడుచున్న తమ బలిష్ఠశరీరములను స్వర్గసంపాదనకై సమరమఖాగ్నికుండములో నిట్టనిలువున హోమముచేయ సంకల్పించి సాగినట్లున్నారు...సమంతపంచకము రాచపీనుగులతో నిండి భయంకరముగా నున్నది...... భీమదుర్యోధనులు తలపడి హోరాహోరి పోరుచున్నారు. దెబ్బలు తగిలి, తొండములూ తలలు కాళ్లు తెగిపడిన యేనుగులతో గుర్రములతో రాజులతో యోధులతో చిందరవందరై, యుద్ధభూమియంతయు, చినిగిపోయిన సంకీర్ణచిత్రపటములాగున కనిపించుచున్నది!..."

దానికి గోదావరిపండితు లెంతయు ప్రీతులై యిట్లు మెచ్చుకొనసాగిరి. 'ఏమి యద్భుతరమణీయమైన యుపమానము! ఈ రాజసింహుడు నిజముగా భరతమల్లుడే, సాహిత్యరత్నాకరుడే!'

ఆ నాటికస్థాపనతో నా సభ సంపూర్ణముగ వికసించెను. అది చూచిన కొప్పెరుంజింగని మోమును వికసించెను. 'ఈ గోదావరిపండితులు రసజ్ఞులు! కృష్ణాతీరమునందలి వల్లని ఒండుమట్టివారు కారు, పెన్నాప్రవాహతీరపు దుడుకుబోతులును గారు!'

అంతట రంగస్థలముపై ముగ్గురు భటులు ప్రవేశించి కురుసంగ్రామరంగము వర్ణి సాగిరి.

"ఈ సమరాశ్రమము పగ ప్రజ్వలింపజేయు కటాహము... శౌర్యము ప్రకటించి అసువులు వాసిన మహాయోధులను అప్సరసలు వరించు స్వయంవరమంటపము!"

ఏమి యీ కవియశోహాలం! భటుడు వర్ణన సాగించుచుండెను.

* ఈ ప్రకరణమున ఊరుభంగరూపకప్రదర్శనము విశేషముగా కలదు. అందుచే అంతటను సంస్కృతమూలమే వాడుట ఉచితము. అయినను పాఠకుల సౌలభ్యమునిమిత్తము ఈ మంగళశ్లోకమును చివరకొంచెమును తప్ప మిగిలిన భాగములు తెలుగులోని కనువదించి గ్రహింపబడినవి.

"అంతకాలములో రాజసింహులు సుఖముగా దీర్ఘనిద్ర చెందు వీరశయ్య!"

ఈ వర్ణనము సభకు కటువుగా తోచినది. కాని తక్కిన వర్ణనములో వడి పరిసిపోయినది. భటుడు సాగించెను.

"ఈ యజ్ఞములో కొండలవంటి యేనుగుల తొండములే యూపస్తంభములు; బాణములే పరిస్తరింపబడిన దర్భలు; కూలిన యేనుగులే యజ్ఞవేదికలు; భగభగ మండు పగలే అగ్నులు; రథకేతనములే వితానవితానములు; సింహనాదములే ఉచ్చైస్స్వనముతో చదువబడుచున్న మంత్రములు!"

ఈ వర్ణనముతో నా కవియార్ష వాక్కులకు సభయంతయు పులకరించెను; రాజసింహుడు ఆనందతన్మయుడయ్యెను.

"అదిగో, మదపుటేనుగు, యుద్ధభూమియోనికి ఐరావతము లాగున పరుగిడివచ్చి నిలిచినది, చూచినారా? అది నానావిధయుద్ధ సామగ్రితో సజ్జితమై, రాజసింహుల యాయుధాగారమువలె గోచరించుచున్నది. అయ్యో, చూచుచుండగనే ఆ యేనుగు శత్రువుల బాణముల దెబ్బలకు తల తిరిగి, కవచము భగ్నమై, యుద్ధసామగ్రితో సహా మహావీరుడువలె, కన్నులు మూసి వ్రణములోనుండి నెత్తురు ధారలుగా కారుచుండగా, నేల గూలినది!"

ఏమిది? ఈ నాటకమున పాత్రలు వర్ణించుచున్నది ప్రదర్శించుచున్న రూపకమునందియా? ఆవల ప్రవృత్తమగుచున్న యామహాయుద్ధమునే వర్ణించుచున్నారా, రాజసింహులకు? భటుడు సాగించుచుండెను.

"హాహా! భయంకరము! ఘోరము! తెగిపడిన ఏనుగుల గుఱ్ఱముల భటుల రక్తప్రవాహములతో నిండిపోయి, చెల్లాచెదురుగా పడిన చర్మములతో చామరములతో తోమరములతో శరములతో కుంతములతో కవచకబంధాదులతో అల్లకల్లోలమై శక్తిప్రాస హాటక భిండిపాల శూల ముసల ముద్గర వరాహకర్ణ కణప కర్పణ త్రాసి గదాది నానావిధయోధాయుధసమూహములతో సమాకీర్ణమైయున్న యీ సమంతపంచకము, అబ్బ, చూడలేము! ఘోరము! భయంకరము!"

* * *

"ఇట్టి దారుణస్థితిలోకూడ రాజులు తమ స్వాభావికశోభా వైభవము పోగొట్టుకొనకుండగనే శోభిల్లుచున్నారు, గమనించినారా?"

ఈ మాటలు వినుచున్న సదస్యులకు ప్రత్యక్షముగా నెదుట రాజసింహుని ప్రాజావైభవము పొడగట్టుచున్నందున వారెంతయు మెచ్చుకొనసాగిరి. అతిశయోక్తిగా కనిపించు కవుల వర్ణనలు కూడ తరచుగా స్వభావోక్తులే!

"వీరాధివీరులైన యిట్టి క్షత్రియవీరులనుగూడ మృత్యువు లోగొనుచున్నదే!"

* * *

"అయ్యో, మృత్యుదేవత క్షత్రియులనుగూడ మ్రింగివేయునా?"

ఆ మాట్లాడు రంగముపై భటునితోపాటు, సదస్యులగు గోదావరిపండితులును, జాలి నొందుచు నిట్టూర్పులు విడిచిరి. వారు చూపుచున్న శ్రద్ధకు కొప్పెరుజింగడు ఉప్పొంగియేపోవుచుండెను.

"ఏమి యీ చప్పుడు?.. ఉరుములా?...పిడుగులు పడి కొండలు పిండి పిండిచేసివేయుచున్నవా?... ప్రచండవాయువు వీచి భూమి బద్దలైపోవుచున్నదా?...ప్రచండమైన వాయువుతో కల్లోలమైలేచి ఉప్పొంగి, సముద్రము మందరగిరి కందరాంతరస్థలములను పగులబొడిచి, ఉల్లోలమై భయంకరముగా హోరుపెట్టుచున్నదా? ఏదో పోయి తెలిసికొందము!"

పై వాక్యము లనుచు నా ముగ్గురు భటులును రంగస్థలమున పరిక్రమించుచుండిరి. సరిగా నాసమయముననే నక్కడ సమీప భూమిలో రణకోలాహలము భయంకరముగా వినవచ్చెను. సముద్రముపైనుండి కూడ భీమమగు నొకానొక యపూర్వరవము వినవచ్చెను. ఉప్పెన వచ్చినట్లే వసిష్ఠగోదావరిలోగూడ మహాతరంగమొకటి లేచెను.

ఏమి టిది, రూపకప్రదర్శనమేనా? నిజముగా రూపకములో వర్ణించినట్లుగానే చుట్టును జరుగుచున్నదే! ఈ రూపకకర్త సాక్షాత్తుగా ఋషి, సత్యవాక్కు!

అంతట నాభటులు భీమదుర్యోధనుల గదాయుద్ధమును, అప్పుడు జరుగుచున్నది చూచుచున్నట్లే, వర్ణించిరి. అందులో భీమసేనుని బలాతిశయము, దుర్యోధనుని కౌశల్యాతిశయము, అద్భుతముగా వర్ణింపబడుచుండెను. సరిగా గజమునకు అశ్వమునకు యుద్ధమే! ఒకదానికి బలమెక్కువ. ఒకదానికి చురుకుదనమెక్కువ! ఆవల జన్నిగ గజసేనలకు కొప్పెరుంజింగని యశ్వసేనలకు జరుగుచున్న యుద్ధమువంటిదే! అల్లావల కోరంగి కాకతి పెద్ద నావలకు చోళుల చిన్న నావలకు జరుగుచున్న నౌకాయుద్ధము వంటిదే, యిదియు!

"అడుగో, రాజరాజు రత్నకిరీటము కదలునట్లు తలపంకించి, క్రోధవిస్ఫారితరక్తనేత్రయుగళముతో పొంచి, భీమసేనుని పదసంధిబంధములో కొట్టుటకు శరీరము వంచి, జాగ్రత్తగా భీమసేనుని చుట్టుముట్టుచున్నాడు ఉత్క్షిప్తమైన అతని చేతిలోని గద, ఎదిరి నెత్తురుతో తడిసియున్నది. చూచినారా, అది కైలాసపర్వతశిఖరాగ్రమునుండి లేచిన ఇంద్రధనుస్సువలె మెరయుచున్నది!"

ఆ వర్ణనమధ్యములో నా యుపమానము గోదావరిపండితులను ముగ్ధులనే చేసినది!

"రాజరాజు భీమసేనుని కొట్టనే కొట్టినాడు. చూడండి! అతని నుదురు బద్దలై రక్తము చింది పారుచున్నది. రెండు బుజాలూ విరిగిపోయినట్లే! దెబ్బలతో బద్దలై భీముని యెదురొమ్ము నెత్తురుముద్దయైనది."

ఆ సభలో ఒక్కసారిగా భీమసేనుని దీనావస్థకు జాలి ఎక్కువైనది. కొందరు కన్నీళ్లు కార్చినారు. గోదావరిపండితులు పలువురు తమవెంట నున్న లక్కవరపుకోట తెల్లని కంచు కొమ్ముచెంబులనుండి, జలము గ్రహించి చెమ్మగిల్లిన తమ కన్నులు తుడిచికొనిరి.

"వృకోదరుడు. మరల భయంకరమైన తన గద గిరగిర త్రిప్పుచు, సింహనాదము చేయుచు, వల్గతితో దుర్యోధనునిపై

(39-వ పేజీ చూడుడు)

అపరాధపరిశోధకకథ :

# బట్టతలలు

(షెర్లాక్ హోమ్స్ కథ)

మూలం:
## సర్ ఆర్థర్ కోనెండాయిల్

అనువాదం:
## శ్రీ రేవూరు కృష్ణమూర్తి

కాలకృత్యాలు ముగించుకొని కాఫీ త్రాగి టాయిలెట్ అయ్యేప్పటికి 9 గంట లయిందా వేళ దాదాపు. ఇంట్లో రాణీగారు లేనందువల్ల ఏమీ తోచక మిత్రుడింటికైనా పోదా మనుకున్నా. రెండునిమిషాలు ఆలోచించివరదారావుఇంటికి బయలుదేరా. వగదారావు B. L. ప్యాసయి కొన్నాళ్లు బండి బాడుగ చేతిది పెట్టుకుంటూ ప్లీడరీవృత్తి చేశాడు. ఆతరువాత అది మానేసి C. I. D. లో చేరి డిటెక్టివ్ అయ్యాడు. అయినప్పటి నుంచి దశ మారింది. అందెవేసిన చెయ్యి అని పేరుపొందాడు కొద్దిరోజుల్లోనే. పెద్ద పెద్ద ఖూనీకేసుల కన్నిటికీ పరిశోధన మావాడిదే. అసలు బుర్ర మంచిదిలేండి. వరదుడు బయటనే సోఫాలో కూర్చొని మాట్లాడుతున్నాడో పెద్దమనిషితో. ఆ వచ్చినమనిషికి బట్టతల. ధృఢకాయుడు, చామనచాయ. నేను రావటం చూచి మాట్లాడుతున్నవాడల్లా ఆపేశాడు. పేపరొకటి తీసి చూట్టం ఆరంభించాడు. "హల్లో! జయరామ్! రావోయ్, ఏం యీనడమ మాయింటివైపు రావటమే మానేశావే?" అన్నాడు నాకో కుర్చీచూపిస్తూ. నన్ను పరిచయం చేశాడు ఆ పెద్దమనిషికి. కాసేపు నిశ్శబ్దం, వరదారావు సిగిరెట్టు పీలుస్తున్నాడు. పెద్దమనిషి పేపరు పైనించి క్రిందికి చూస్తున్నాడు తొందరతొందరగా. చేతులు నలుపుకుంటూ దిక్కులు చూస్తూ కూచున్నా నేను. కాసేపుండి లేచా. "క్షమించు వరదా! అర్జంటుపని మీద వెళ్లాలి. అదీకాక నేను మీకు అడ్డమేమో?" అన్నా నిలబడే. "కూచోవోయ్ మిస్టర్!" అని పెద్దమనిషి ప్రక్క తిరిగి, "ఏమండీ! సుబ్బారావుగారూ! కనపడలే దింకా" అన్నాడు. నేను కూచున్నా. "ఇదుగోనండి" అంటూ సుబ్బారావుగారు పేపరు మీద బొటనవ్రేలు పెట్టి వరదారావుదగ్గఱికి తెచ్చాడు. "అది చదవోయ్ జయరామ్!" అంటూ పేపరు నాకిచ్చాడు సుబ్బారావు దగ్గరినుంచి నా మిత్రుడు. దాన్లో ఈలా ఉంది.

మంచితరుణము మించిపోవును!
అలసించిన ఆశాభంగం!!

బట్టతలల సంఘం :—

ఓ ఉద్యోగి కావాలి. జీతం నెలకు మూడువందలు. పని చాల తక్కువ. వేళపన్లు చేసుకునేవాళ్లు కూడ ప్రయత్నించవచ్చు. పనిగంటలు ఉద్యోగి ఇష్టం. అప్లికేషనలు 25 వ తేదీలోగా ఈ క్రింది అడ్రసుకు రావాలి. 26 వ తేదీన అందరూ ఇంటర్వ్యూకు రావాలి.

బట్లతలల సంఘం;
పూర్ణావీథి, బెజవాడ.
13—10—30

ఇట్లు
నారాయణరావు.
బట్టతలల సంఘం కార్యదర్శి.

చదవటం పూర్తిచేశా. నాకేం అర్థం కాలే. పైగా నవ్వు వచ్చింది. "ఏమిటది, అర్థం కాలేదూ?" అని ప్రశ్నించాడు వరదుడు. "అయితే మళ్లీచదువు" అన్నాడు మళ్లీ చదివా. "నాకేం ఎక్కటం లేదు. బుర్రలోకి" అన్నా నామిత్రుడివైపు చూచి. "సుబ్బారావుగారూ! మీకథ మళ్లా చెప్పండీ మా మిత్రుడుకూడా, వింటాడు." అన్నాడు శ్రద్ధతో వినాలని ఈజీచేర్ పైన కాళ్లు ముడుచుకొని కూర్చున్నా. ఆరంభించాడు సుబ్బారావు. "రెండునెల్లక్రిందట ఇదే పేపరు చేతిలో పెట్టుకొని నాదగ్గిరి కొచ్చాడు నా నౌకరు ఆనంద్" "ఆనంద్‌ను గూర్చి కొంచెం చెప్పండీ!" అంటూ అడ్డు తగిలాడు వరదారావు చెప్పేవాణ్ణి చెప్పనీక. "చెప్తా"నంటూ పెద్దమనిషి అందుకున్నాడు. నాది ఒక ఇనుపకొట్టు. ఈ ఊరిలోనే కృష్ణాబ్యాంకుప్రక్కన కూలీవాడు కావాల్సి ప్రయత్నించా. జీతం నెలకు 80 ఇస్తానన్నా ఎవ్వడూ రాలేదు. కొన్నాళ్లకే ఆనంద్ వచ్చాడు. ఆనంద్ బలమైనవాడు. కొద్దో గొప్పో డొక్కశుద్ధి ఉన్నవాడు. ఉత్తరహిందూదేశంనుంచి వచ్చాననీ, తనకు కమ్మరం తెలుసుననిన్నీ 40 రూపాయలకే ఉంటాననిన్నీ అన్నాడు. నాకింకేం కావాలి. సరే! పనిలో చేర్చుకున్నా. పొద్దస్తమానం పనిచేసి సాయంత్రం కాగానే తన కెమెరా తీసుకొని సామానులు ఉంచే క్రిందిగదిలోకి పోయేవాడు. పోయి తలుపు వేసుకొని ఓగంటో గంటన్నరో కూచొని బయిటి కొచ్చేవాడు. ఏం చేశావంటే తనకు ఫోటోగ్రాఫీ వచ్చని, తన ఫిల్ములు కడగటానికి వెళ్తున్నానని చెప్పేవాడు. నేను నమ్మేవాణ్ణి. ఇట్లా కొన్నాళ్లు గడచాయి. ఓనాడు ఆనంద్ ఈ పేపరు తెచ్చి టేబిల్ మీదవేసి, "పాడుతల! పాడుతల! వెంట్రుకలు లేకున్నా బాగుండును," అని గొణుక్కుంటున్నాడు. "ఏమిటానంద్! అన్నా నేను. అడ్వర్టైజుమెంటు చదివాడు. నాది బట్టతల పోతే బాగుండునేమో అనిపించింది. ఆనంద్ "ఏమండీ సుబ్బారావుగారూ! మీకు బట్టతలకదా? క్షమించండి. మీరెందుకు ప్రయత్నించకూడదూ?" అన్నాడు. "నేను ప్రయత్నిస్తే నాకు వస్తుందని నమ్మకం ఎట్లా? ఎందరు లేరు బట్టతలవాళ్ళు ఈ ఊళ్లో. అసలు ఈ సంఘం ఏమిటోయ్; విచిత్రంగా ఉందే!" అన్నా. "అయితే మీ రెప్పుడూ వినలేదన్నమాట ఈ సంఘంసంగతి! అరెరె! చెప్తా వినండి. ఇంతకు పదేళ్లముందు గోవిందయ్య అనే వర్తకు డుంటుండేవాడు. ఆయనకు ఎంత డబ్బుందో ఆయనకే తెలీదు. ఆయనకు బట్టతల. ఆయన చనిపోయేప్పుడు కొంత డబ్బు ఖర్చుపెట్టి ఓ సంఘాన్ని ఏర్పాటుచేసి దానికి తగిన

సదుపాయాలిచ్చాడు. ఆ సంఘమే ఇది. వీరిపని బట్టతలలవారికి సాయంచేయటం." అన్నాడు ఆనంద్.

"అడ్వర్టైజుమెంట్! నిజమంటావా?" అని ప్రశ్నించా సందేహిస్తూ. ఆనంద్ నవ్వాడు చిన్నగా. "అదేమండీ! అలా అంటారు. పేపర్లో వేశేవి అబద్ధాలుంటాయా" అన్నాడు. ఇద్దరికీ కాసేపు వాదం జరిగింది. సరే! నేను కడాకు ఒప్పుకున్నాను ఉద్యోగానికి ప్రయత్నించటానికి. అప్లికేషన్ పంపించా. 26 వ తేదీన సంఘం ఆఫీసుదగ్గిరికి తీసుకెళ్ళాడు ఆనంద్ నన్ను.

అదో చిన్న రెండంతస్తుల మేడ. ఆ వీధి మలుపు తిరిగేప్పటికల్లా బట్టతలలు ప్రత్యక్షం. ఎన్నో వేలు! కొందరు నున్నగా గొరిగించుకున్నారు. కొందరేవో మందులు పూసుకొని వెంట్రుకలు పోగొట్టుకున్నారు ఉద్యోగంకోసం. నాకు ఆశ పోయింది. "ఇందర్లో నాకన్నా మంచి బట్టతలలవాళ్లు లేరూ' అని సందేహం వచ్చింది "వెనక్కు పోదాం లాభం లేదు" అన్నా ఆనంద్‌తో. ఆనంద్ పట్టు వదలేదు. నన్ను గుంపులోంచి లాక్కెళ్ళాడు ఆఫీసుదగ్గరకు. ఓలావాటి ఆఫీసరు కూచోన్నాడు కుర్చీలో. ఆయనదీ బట్టతలే! ఆనంద్ నన్నుగూర్చి చెప్పాడు ఉద్యోగికి "ఇలా రాండి" అంటూ ఓ గదిలోకి తీసుకెళ్లాడు. లైటు ఫోకసు చేసి నా తల తడిమిచూశాడు. ఆ తరవాత తన ఉంగరాలవ్రేళ్లతో ఆరుసార్లు మొట్టాడు. కళ్లలో నీళ్లు తిరిగాయి. నీళ్లు రావటం చూచి, "అచ్ఛా" అన్నాడు ఉద్యోగి. "క్షమించండి, మీ బట్టతల అసలైంది కాదో అవునో అని పరీక్షించాను. మీ తల మాకు తృప్తినిచ్చింది. మిమ్మల్ని ఉద్యోగానికి తీసుకుంటామని చెప్పటానికి వీరికి చాలా ఆనందంగా ఉందని తన రొమ్ము చూపించుకున్నాడు ఆఫీసరు. నన్నో కుర్చీలో కూచో పెట్టాడు. ఆనంద్ నా వెనుక నిలబడ్డాడు. ఆఫీసర్ కాసేపు ఊరుకుండి, "ఆ మరిచిపోయా, తమకు పెళ్లి అయింది కదూ?" అన్నాడు నవ్వుతూ. "అయింది. భార్య వచ్చి నెల్నాళ్లు అయిందో లేదో స్వర్గస్థురాలైంది. మళ్లీ పెళ్లికి నా మనస్సు ఒప్పుకోలేదు" అన్నా హృదయభారంతో. "అరెరె! మీరు పెళ్లిచేసుకోని ఉండాలిసింది. పోనీలే మించిపోయిందేమిటి? ఇప్పుడన్నా చేసుకోండి. ఏమంటే గోవిందయ్యగారికి బట్టతలలవాళ్లంటే చాల ఇష్టం. వాళ్లు వృద్ధి పొందాలని ఆయనగారి ఆశయం. ఆ భారం మీపైకూడ ఉంది కదండీ మరి?" అని కాసేపుండి, "ఇంకో సంగతి. అసలు పెళ్లి కానివారికీ ఉద్యోగం ఇవ్వకూడదు. కాని మీతల మాకెంతో ఆనందాన్ని ఇవ్వబట్టి మిమ్మల్ని తీసుకుంటున్నాము." అన్నాడు. "బ్రతుకు జీవుడా" అనుకొని "ఎన్నిగంటల కొచ్చి పోతుంటారు?" అన్నాడు. "మీ ఇష్టం" అని విధేయతతో "రోజూ పన్నెండు కొచ్చి మూడుకు పోతుండడం మీకేమీ అభ్యంతరం లేదనుకుంటాను" అన్నాడు "సరే మీయిష్టం, అయితే పనేమిటో, చెప్పారు కాదు" అన్నా. "మీరు రోజూ పన్నెండుకల్లా మీ కలంతో, కాయితాలతో, సిరాతో రావాలి, పన్నెండు నుంచి మూడుదాకా ఆఫీసులో ఉండాలి. గోవిందయ్యగారి జీవితచరిత్ర చూచి రోజూ మీ కాయితాల్లో వ్రాస్తుండాలి. మీ పని గంటల్లో ఆఫీసు వదలకూడదు. జ్వరమొచ్చినాసరే ఆఫీసుకు రావాలి వచ్చి 3 గంటలసేపు కూర్చొని పోతుంటే చాలు." అన్నాడు. ఇంటికి వెళ్ళాం. ఆ రాత్రి ఆలోచన్లో పడ్డాను. "ఇదంతా స్వప్నంటా, పచ్చిమోసం. లేకుంటే బట్టతలల సంఘం అట. వీళ్ల బొంద. సంఘానికి డబ్బట. ఓ ఆఫీసు. నెలకు 500 జీతం. ఎందుకింతా రోజూ ఆ మహనీయుడి జీవితగాథ కాపీ చేసిందానికి. ఇదేదో తేల్చుకోవాలి" అనుకొని నిద్రాదేవిని కౌగలించుకున్నా.

రెండోరోజు కలం, సిరా, కాయితాలు అన్నీ పట్టుకొని బ్రాహ్మణవీధి కెళ్ళా ఆఫీసుకు పోదామని. అసలు ఆఫీసు ఉంటుందనేనా? వెళ్ళేప్పటికి ఆశ్చర్యం వేసింది. "బట్టతలల సంఘం కార్యాలయం" అని ఓ బోర్డు కనిపించేప్పటికి ఆశ్చర్యం, అనుమానం వన్నాక్రమించాయ్ ఒక్కసారిగా. నారాయణరావుగారు నాకోసం కాచుకొని ఉండటం గమనించి చేతిగడియారం చూచా ఆలస్యంగా వచ్చేనేమో నని భీతిల్లి. ఇంక పావుగంట ఉంది పన్నెండుకు. జీవితచరిత్ర తెచ్చిచ్చాడు నారాయణరావు. కాపీచేయడం ఆరంభించా. మొదటిప్రకరణం కాపీచేయడం పూర్తిచేశా. మూడుకొట్టేప్పటికి. ఆ మూడు గంట లయ్యేలోగా ఏ పదిసార్లో పదిహేనుసార్లో వచ్చాడు నారాయణరావు నేను ఉన్నానో లేక ఉడాయించానో నని. మూడు కాగానే ఇంటికొచ్చా. నేను లేనప్పుడు ఇద్దరు వచ్చారని వాళ్ల పనితనం చూచి పంపానని ఆనంద్ అనేప్పటికి నా కానందమైయింది. ఇలా ఓ వారంరోజులు

(33 పేజీ చూడుడు)




ఎప్పుడో ఒకనాడు మృత్యుదేవత తమ ఇంట్లో కూడా అడుగు పెట్టుతుందన్న విషయాన్ని తెలుసుకోడానికి ఇష్టపడరు, సాధారణంగా, ఆనందాన్నే కాంక్షించే మానవులు.

అన్ని ఊళ్లలాంటిదే ఆ ఊరూ.

"ఇలా అవసర మొస్తుందంటే మరో నాడు పుచ్చుకుని ఉందు నామదం. చూస్తున్నారుగదూ, ఎంత నీరసంగా ఉన్నానో! ఇప్పుడే నాలుగు చారు మెతుకులు తిందామని వెళ్తున్నాను; మరేమీ అనుకోకండి."

"నా కిటువంటి పిచ్చిపిచ్చినమ్మకాలేవు గాని మా అత్తగారు వీలు కాదంటున్నారండీ. మా కోడలు, తెలుసుగదూ, ఇప్పుడయిదో నెల—కాకపోతే కాకిచేత కబురుపంపినా నే సిద్ధమేగదా!"

"ఈ వాళ మా సూపర్నెంటు దొరగారు వస్తున్నారు—చూడండీ, అధికారి వచ్చినప్పుడే లోటువచ్చినా పీకలు తెగిపోతాయి. ఈ బాదరబందీ లేకపోతే తప్పకుండా........"

"మసీలిముద్దలు, వేసిన కాలు తియ్యలేకుండా ఉన్నారు అమ్మా నాన్నాను.

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

మేము రావడం తప్పటం; ఏటుబోయి ఎటొచ్చినా ప్రపంచం మా మీద నింద వేస్తుంది. ఈ సంగతి తెలియక మేమే రావాలనుకుని బయల్దేరుతున్నాం గాని......"

"మధ్యాహ్నం రెండు గంటలబండ్లో ప్రయాణం పెట్టుకున్నాం, ఇంకా కర్రా కంపా వగైరాలు సర్దుకోవడమే పూర్తి కాలేదు. క్షమించండీసారికి.....'

"అవసరం వచ్చిన కుటుంబాలు మరోసారి సాకులు పెట్టేవాళ్లవుతున్నారు, సాకులు పెట్టేవాళ్లకే ఇంకోసారి అవసరాలు వస్తున్నాయి కాని ధోరణిమటుకిదే ఇంచుమించు ప్రతిసారీ, వెళ్లకుండా తప్పించుకోడాని కా ఊళ్లో.

అటువంటి ఊరికి హైస్కూలు మాష్టరుగా వచ్చారు సన్న్యాసిపంతులుగారు తమ ముప్ఫయి రెండవ ఏట, కొత్తగా బి. యిడి. ప్యాసై. తక్కిన దేశాలో అయితే మామూలు మనిషిగానో అంతకంటే తక్కువ విగ్రహపుష్టికలవాడుగానో ఎంచబడవలసిన ఆయన దుర్బలులకు పుట్టినిల్లయిన ఈ దేశంలో మటుకు ఏపైనా మనిషిగానే పరిగణింపబడతారు. ఒక్క స్కూలుకు వెళ్లేటప్పుడు తప్ప తక్కిన అన్నివేళల్లోనూ ఆయన కాషాయబట్టలే కట్టుకోవడము చూసి చాలామంది అనుకున్నారిత డెవడో వింతమనిషిరా అని.

ఆయన ఆ ఊరికి వచ్చిన నెలరోజులకొకనాటి సాయంత్రం అప్పుడే స్కూలు నుండి వచ్చి బట్టలు మార్చుకుంటుండగా, ఇంటివాళ్లు నివసిస్తున్న అంతలిభాగపు వసారాలోనుండి ఒక సంభాషణ వినపడిందాయనకు.

ఇంటిఆయన: "పాపం పోయాడన్న మాట నరసింహం. ఎంత ఘోరం, ఎంత ఘోరం! చిన్నవాడేను..."

బొంగురుగా ఉన్న ఎవరిదో కొత్త గొంతు – "ఏదీ ఇంకా దసరాకు ముప్ఫయ్యేడు కాబోలు నిండుతుంది."

ఇంటాయన: "ఎంత కష్టమెంత కష్టం!"

కొత్తగొంతు: "ముగ్గురం కుదిరాం గాని నాలుగో చెయ్యి కనిపించటం లేదు. ఎలాగన్నా తమరు శ్రమనకోకుండా రావాలి. శర్మ మీకు మరీ మరీ చెప్పమన్నాడు—"

ఇంటాయన: "నిన్న రాత్రంతా ఒంటిమీద తెలివే లేకుండా ఉన్నాను. తెల్లవారుఝామునే విడిచింది జ్వరం."

ఇంటాయనతల్లి: "మరొకరెవర్నన్నా చూస్తే మంచిది. చన్నీళ్లు స్నానం చెయ్యడానికి వీలు కాదబ్బాయి."

తనతో రాత్రి పన్నెండుగంటలవరకూ భగవద్గీతమీద బాతాఖానీ కొట్టిన మనిషి జ్వరమని అబద్ధమాడడం విన్న సన్న్యాసిపంతులుగారి కాశ్చర్యమైంది. వెంటనే

పైకి వచ్చి "నేను వస్తానండీ—ఒక్క నిమిషముండండి" అన్నారవతలివసారాలోని కొత్తపెద్దమనిషితో.

ఇచ్ఛాపూర్వకంగా అటువంటి పనికి వస్తామన్న గొంతు మొదటిసారిగా ఆ ఊళ్ళో విన్న ఆ పెద్దమనిషికళ్లల్లో ఆశ్చర్యమూ కృతజ్ఞతా మెరిసాయి.

ఇంగ్లీషు చదువుకున్నవాడసహ్యించుకోకుండా ఇటువంటిపనికి పూనుకోవడం చూసినవాళ్లందరూ ఆరాత్రి పలువిధాలుగా చెప్పుకున్నారా ఊళ్లో.

ఆరోజు మొదలైన వారి కీర్తిగానం రెండేళ్లపాటించుమించుగా సాగింది. ఈ లోపుగా ఆయన పదిపన్నెండుకుటుంబాల కాపత్కాలంలో సాయపడి తన మానవత్వానికి మెరుగు దెచ్చుకున్నాడు. ఇంతే కాకుండా ఎన్నో ఇళ్లల్లో రోగకాలంలో సాయపడి పరిచర్యలు సేసి ఎన్నో ప్రాణాలు నిలబెట్టిన మటకూడా దక్కిందాయనకు. నిజంసన్యాసులూ దొంగసన్యాసులూ మాత్రమే ఉపయోగించే కాషాయబట్టలా ఊళ్లో కాలక్రమాన పరోపకారానికి బయలుదేరే సన్నయ్యపంతులుగారి ప్రత్యేకచిహ్నాలైనాయి.

ఆయనమీదా ఊరివాళ్లకు గల గౌరవభావానికి రామశాస్త్రిగారింట్లో తగిలింది తొలి దెబ్బ. శాస్త్రిగారి పెద్దకొడుకు పొలంనుండి వస్తుండగా పాముకరచి పోయాడని ఎవరో చెప్పారు స్కూలుకెళ్దామని బయల్దేరిన సన్నయ్యపంతులుగారికి. వెంటనే ఆయన ఆదారిన బోయే కుర్రవాడొకణ్ణి పిలిచి సెలవుకాగితం రాసిచ్చి బట్టలు మార్చుకుని శాస్త్రిగారింటికి బయల్దేరి వెళ్లారు మనసులో గీతలోని శ్లోకాలు పారాయణ చేసుకుంటూ. తీరా అక్కడకు వెళ్లేసరికి మరణవార్త నిజం కాదని తేలింది. పాము కరిచినమాట నిజమేనట. ఒక అరగంట క్రిందట అనుమానంగా ఉండి అతన్ని వీధిలోనికి తీసుకురావడమూ బంధువు లందరూ ఆఖరుసారిగా సాముదాయికరోదనసత్కారం చెయ్యడం కూడా జరిగిందట. కాని ఇంతలో డాక్టరుగారు వచ్చి ఇంజక్షనేదో ఇవ్వడంతో బ్రతుకుతాడన్న ఆశ కలగడాన్ని మళ్లా అతన్ని గృహప్రవేశం చేయించారట.

అప్పుడే కొద్దిగా నిబ్బరం తెచ్చుకుని అరుగుమీద కూర్చుని చుట్టకాల్చుకుంటున్న శాస్త్రిగారికి గుండెల్లో రాయిపడ్డట్లయింది సన్నయ్యపంతులుగార్ని గుమ్మంలో అడుగుపెట్టడంతోనే. ఆ కాషాయబట్టలు ఏదో రాబోయే అశుభానికి సూచకాలుగా కనిపించాయి వారి కళ్లకి.

పరిస్థితులవగాహన చేసుకున్న పంతులుగారు లౌకికంగా ప్రవర్తించి అబ్బాయిని గురించి కుశలప్రశ్నలు వేసి వెళ్లిపోయారు. అతన్ని బ్రతికించినందుకు నీలకంఠేశ్వరస్వామివారికి మనస్సులో ధన్యవాదాలిస్తూ.

దురదృష్టవశాత్తూ ఆరాత్రే ఆ అబ్బాయి స్వర్గీయుడవడంతో శాస్త్రిగారింట్లో గుసగుసలు బయలుదేరాయి. కాని మర్నాడుదయానికి సన్నయ్యపంతులుగారి సాహాయ్యం మటుకు అవసరం కావడాన్ని, పైకెవరూ ఆయనవద్ద ఏమీ అనలేదు.

ఆరోజునుండీ మొదలైంది సన్నయ్యపంతులుగారు అశుభానికి సూచకు లన్న అనుమానమా ఊళ్లో. అంతవరకూ కళ్లకింపుగా కనిపించిన ఆయనకాషాయబట్టలీ సంఘటన జరిగినప్పటినుండీ ఎక్కడో ఆ ఊరి బ్రాహ్మణకుటుంబాల్లో సంభవించిన లేక సంభవించబోయే మృత్యువుకుమటుకే ప్రథమసూచకాలు కావడం మొదలుపెట్టాయి.

అసలు రోగకాలంలో సన్నయ్యపంతులుగారే ఇంటికి వెళ్లినా వార్నదొకరకంగా చూడడం ఆరంభించారు లోకులు. రోగికి పరిచర్యలకూ సలహాలకూ పిలిచేవాళ్లు పిలవడం మానినా ఆయనమటుకు తన అలవాటుచొప్పున వెళ్లడం మానేవారు కాదు. అయినగాని వస్తే ఏన్నో అనాలని మనసులో నిశ్చయం చేసుకున్న కుటుంబీకులు కూడా ఆయన రావడంతోనే ఆ ముఖవర్చస్సూ మాటల చల్లదనమూ చూసి ఏమీ అనలేకపోయేవారు. ఆయన వచ్చి వెళ్లిన వెంటనే ఏ ఆపదా రాకుండా కాపాడడానికి సత్యనారాయణవ్రతం చేస్తామనీ, ఇత్యాది ఏవో మొక్కులు మొక్కుకోవడం పరిపాటయిపోయింది. ఆ ఊరి బ్రాహ్మణస్త్రీలకూ, మానసికపరిణామంలో తత్తుల్యులే అయిన బ్రాహ్మణపురుషులకూ సన్నయ్యపంతులుగారు వచ్చి వెళ్లాక ఏ ఇంట్లోనైనా రోగి బతుకుతే అది భగవంతుని కృప మాత్రమేనని గట్టిగా నమ్ముతున్నారా ఊరివాళ్లు.

కొన్నాళ్లకాయన ఎదటనే కాదుగాని పక్కపక్కల గుసగుసలు ప్రారంభమైనాయి. రకరకాలగా అనుకోవడం మొదలుపెట్టారు మనుషులు.

"అదుగో 'కాషాయగద్ద' బయల్దేరింది. ఎక్కడో పిట్టెగిరిపోతున్నట్లున్నదే!"

"వచ్చాడూ యమధర్మరాజు! మరి ఆశ లేనట్లే!"

"అవసరముంటే పిలవరూ? ఎందుకు చెప్మాఅని మళ్లా సిద్ధమవుతాడు కాషాయగుడ్డలూ వీడూ!"

(32-వ పేజీ చూడుడు)



జనీవా అంతర్జాతీయ కార్మికసమావేశానికి వెళ్లిన భారతప్రతినిధులు శ్రీయుతులు జగజీవనరామ్, అనుగ్రహనారాయణసిన్హాగారలు.

# హాలుని గాథాసప్తశతి

శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి



ప్రాకృతభాషాపరమోత్కర్షాపరభూమి అయిన గాథాసప్తశతి, ఏడు శతకములు గల ఒక గాథారత్నకోశము. అది, హాలుని చేత సంగ్రథిత మైనది. హాలుడు అనగా శాతవాహనుని మాఱుపేరు. హాలుడు, శాలుడు, శాతవాహనుడు, సాతవాహనుడు ఇవి పర్యాయపదము లని హైమకోశాదుల ద్వారా విదిత మవుతున్నది. శకప్రవర్తకు డైన హాలసాతవాహనుడే, ప్రకృతగాథా సప్తశతీనిర్మాత అని విమర్శకులు సప్రమాణముగా నిర్ణయించినారు.

సాతవాహనుడు ప్రతిష్ఠానపురాధిపతి. విద్వదగ్రణి. దీపకర్ణికుమారుడు. బృహత్కథాప్రణేతి అయిన గుణాఢ్యుడు, కాలాపవ్యాకరణకర్త శర్వవర్మ, మొదలైన ఉద్దండపండితు లెందఱో, సాతవాహనుని సభామందిరమున మండనాయమానులై ఉండేవారు. ఇతడు, క్రీస్తుశకము మొదటి శతాబ్దములోనివాడు. క్రీస్తుశకము తరువాత 78 సంవత్సరములకు శాలివాహనశక మారంభమైనది. ప్రతిష్ఠానపురము, దక్షిణాపథములోనిది. అది యిప్పుడు 'బీదర్'అని వ్యవహారింపబడుచున్నది.

ఒక ప్రాచీనగాథాసప్తశతీప్రతి సప్తమశతకసమాప్తిలో:—

"ఇతి శ్రీమత్కుంతల జనపదేశ్వర,ప్రతిష్ఠానపత్తనాధీశ, శతకర్ణోపనామక ద్వీపి (దీప) కర్ణాత్మజ, మలయవతీప్రాణప్రియ, కాలాపప్రవర్తక శర్వవర్మధీసఖ మలయవత్యుపదేశ పండితీభూత, త్యక్తభాషాత్రయ స్వీకృతపైశాచిక పండితరాజ గుణాఢ్య నిర్మిత భస్మీభవ ద్బృహత్కథావశిష్ట సప్తమాంశావలోకన ప్రాకృతాది వాక్పంచక ప్రీత, కవివత్సల, హాలాద్యుపనామక, శ్రీ సాతవాహన నరేంద్ర నిర్మితా, వివిధాన్యోక్తిమయ ప్రాకృత గీర్గుంఫితా, శుచిరస ప్రధానా కావ్యోత్తమా, సప్తశత్యవసానమగాత్."

అని గద్యము కూర్చబడి ఉన్నది. దాని ద్వారా గాథాసప్తశతీనిర్మాత అయిన హాలసాతవాహనుని, పుట్టుపూర్వోత్తరములు స్పష్టముగా తెలియవచ్చుచున్నవి.

కథాసరిత్సాగరము షష్ఠతరంగములో శాలివాహనమహీజానిచరిత్రము కొంత పై విధముగనే వివరింపబడి ఉన్నది.

"మొట్టమొదట శాలివాహనునకు సంస్కృతపరిజ్ఞానమే లేదట. అతని పట్టమహిషి మలయవతి, సంస్కృతమున అపారప్రజ్ఞ కలది. ఒకనాడు, శాలివాహనుడు మలయవతితో వనవిహారము చేసి, అలసి, జలక్రీడ చేస్తూ ఉన్నాడు. ఓలిఆట ఆడుతూ ఒకరిమీద ఒకరు నీరు చల్లుకొంటున్నారు. మలయవతి, ఆ నీటిపోతకు సహించలేక, ఉక్కిరిబిక్కిరి అయి, భర్తతో— "మోదకైస్తాడయ"— అంటే— మా ఉదకైః తాడయ = నీళ్ళతో కొట్టకు— అని అన్నది. సంస్కృతగంధాఘ్రాణము లేని కారణాన, శాలివాహనుడు, మలయవతి వాక్యములోని సంధిస్వరూపమును తెలిసికోలేక, -మోదకైః— అనితలచి, "కుడుములు తీసుకురావలసినది" గా, పరిచారికలకు అజ్ఞాపించినాడు. అది విని మలయవతి పకపక నవ్వినదట. అందుకు శాలివాహనుడు చాలా సిగ్గుపడి, వెంటనే సభామంటపమునకు వచ్చి, ఆస్థానపండితుల నందఱను పిలిపించి— మీలో, చాలా తొందరలో, నాకు సంస్కృతవ్యాకరణపాండిత్యమును కూర్పగలవా రెవరైనా ఉన్నారా?—అని ప్రశ్నించినాడు.

అతని ఆస్థానపండితులలోని శర్వవర్మ, రాజుమాట వినగానే, లేచి—ఆరుమాసములలో నీకు సంస్కృతవ్యాకరణపాండిత్యమును పరిపూర్ణముగా కూర్పగలను—అని అన్నాడు. వెంటనే, అది అసంభవము, నీవల్ల గాదు—అని గుణాఢ్యపండితుడు ఉద్ఘాటించినాడు. తప్పక చెప్పగలను— అని శర్వవర్మ రాయి గ్రుద్దినాడు. నీవలా నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకొనేయెడల, నా నేర్చిన ప్రచలితభాషాపాండిత్యమును విడిచిపుచ్చి, ఏనాడూ వాటిని ఉచ్చరింపనైనా ఉచ్చరింపనని గుణాఢ్యుడు ప్రతిజ్ఞ చేసినాడు.

శర్వవర్మ, కార్తికేయోపాసకుడు. అతడు దృఢనియమముతో, కుమారస్వామి నర్చించి, సంతోషపెట్టి, తాను మునుమున్నుగా వ్యాకరణమున నిరుష్టమైన పాండిత్యమును సంపాదించి, కుమారస్వామి అనుగ్రహముచేత, ఆఱుమాసములలో శాలివాహనుని ఉద్దండపండితుని చేసెను. గుణాఢ్యుడు, ప్రతిజ్ఞానుసారముగా, ప్రచలితభాషాపాండిత్యముతో బాటు, ప్రతిష్ఠానపురమునుకూడా వదలివేసి, అడవులకుపోయి అచట, మృగములతో, పిశాచములతో, చెలిమి సంపాదించుకొని, పైశాచికభాషలో బృహత్కథను నిర్మించినాడు. శాతవాహనుడు, గురువైన శర్వవర్మకు సగౌరవముగా రత్నాదికములు గురుదక్షిణ ఇచ్చి, 'భరుకచ్ఛము' అనే ప్రదేశమును, అతనికి సర్వహక్కులతో కానుకగా ఇచ్చివేసినాడు".

పై కథాసరిత్సాగరకథను బట్టి పూర్వోక్త సప్తమశతకాంతగద్యమును బట్టి, విచారింపగా, ఒక విషయము మనకు గట్టిగా పొడగట్టుతున్నది. ఏమనగా—

"ఈ శాతవాహనుడు - చరిత్రకారులు ఈతనిని 'సాతవాహనుడు' అని మాత్రమే అంటారు—తాను స్వయముగా, సంస్కృతభాషావైదుష్యము లేనివాడే అయినా, పలువురు కవిపండితశ్రేష్ఠులకు తాను ఆశ్రయముగా ఉండుటచేత, వారితోడి సతతసంపర్కముచేత, కవితాపరిచయము కలిగి, ఆ కళలో చతురుడు, రసికుడు, అయినాడు. అందువల్ల, ఆ కాలమున ప్రచారములో ఉన్న ప్రాకృతకవితలను మిక్కిలి అభినందించుతూ, తత్కవులను పోషించి, ప్రోత్సహించుతూ, అతడు ప్రాకృతకవులపాలిటి కల్పతరువుగా పేరుపడసినాడు. రేయింబగళ్లు కవితాగోష్ఠులలో, కావ్యమీమాంసలలో, మునిగి తేలుతూ ఉండుటచేత, తత్పరినిష్ఠమైన బుద్ధివిశేషముచేత, గొప్ప అనుభవమును సంపాదించి, శాలివాహనుడు తానకూడా సుమధురముగా అప్పుడప్పుడు కవిత్వము చెప్ప నేర్చినాడు."

'గాథాసప్తశతిని శాలివాహనుడే రచించి నాడు' అని పలువురి అభిప్రాయము కాని అది యట్టి భ్రమమాత్రమే. ఇందలి ప్రతి ఒక శతకముచివర—

"రసిఅజ॰ హిఅఅ దఇఏ
కఇవచ్ఛ ప్పముహ సుకఇ ణిమ్మవిఏ."
అనగా—
"రసికజన హృదయదయితే కవి
వత్సలప్రముఖసుకవినిర్మితే,"

అని స్పష్టముగా రచింపబడి ఉన్నది. దానిని బట్టి, ఈ సప్తశతిలో, పలువురు మహాకవుల కృతులను 'శాలివాహనుడు సంగ్రహించినాడు.' అని తెల్లమవుచున్నది. కవిజనకల్పద్రుమాయమాణుడైన ఈ మహీజాని ఆస్థానమున పలువురు కవివరులు ఆశ్రయమును సంపాదించి, సమ్మానము లొందుచుండెడివారు. పలువురు, శాలివాహనుని గౌరవసమ్మానము లాసించి, దూరదూరములనుండి వచ్చి, తమతమ పాండిత్యములను ప్రకటించుచుండెడివారు.

కవితాకలాపకోవిదుడైన ఈ భూవరుడు, అతిచమత్కారములై, రసవంతములైన, ఆయా కవిశేఖరుల మధురకవితలను, స్వజనులచేత పత్రములపై వ్రాయించి, భద్రముగ దాచియుండెడివాడు. అనంతరము, సహస్ర సంఖ్యలుగా సమకూరిన ఆయా రచనలలో, సుమధురములై ఉన్నతములైనవానిని, ఏరి, ఆయాకవుల కీర్తివైభవములను లోకములో శాశ్వతముగా నిలబెట్టుటకు, ఏడుశతకములుగా సంగ్రహించి, 'గాథాసప్తశతి' అను పేరుతో ప్రకటించినాడు. ఈవిషయము, సప్తశతిలోని ప్రథమశతకము మూడవ గాథ ద్వారా స్పష్టమవుతున్నది. అది ఇట్లు ఉన్నది

(సౌకర్యముకోసము, గాథాసంస్కృతచ్ఛాయ ఈబడుతున్నది.)

"సప్తశతాని కవివత్సలేన కోటేర్మధ్యే, హాలేన విరచితాని సాలంకారాణాం గాథానామ్." ౧-౩

ఆయాకవులచే రచింపబడిన గాథలను సంగ్రహించి, లోకములో వారి కీర్తులను స్థిరముగా నెలకొలుపుటచేత, హాలునకు 'కవివత్సలుడు' అను సార్థకబిరుదనామము కలిగినది. అతడు, సంగృహీతమైన తన గాథాకోటియందు, సాలంకారములైన గాథలు, ఏడువందలు కూర్చినాడు, అనగా సంకలితము చేసినాడు, అని భావము.

మహారాజోచితములైన సుఖవిలాసములలో మునిగి తేలుతూ ఉండే ఈ సార్వభౌముడు, గాథాసప్తశతీసంకలనమును తన చేతులతో నిర్వర్తించిన శ్రమకూడా తీసికొనలేదనియే అనవలె అయితే—

"అవినాశిన మగ్రామ్య
మకరోత్సాతవాహనః,
విశుద్ధజాతిభిః కోశం
రత్నైరివ సుభాషితైః."

ఇత్యాది బాణాదుల వాక్యములు, కేవలము ఔపచారికములే అని అనవలె.

ఈ మహారాజు అభిప్రాయమును గుర్తెరిగి, రాజసమ్మానాపేక్షతో తదాశ్రితుడైన కవిశేఖరు డొకడు, ప్రభువుఅభిరుచిని అనుసరించి, రాజుపేరుతో, ఈగాథాసప్తశతిని సంగ్రహించి, వానికి సమర్పించిఉండవచ్చు. అంతేకాని, గాథాసప్తశతిని స్వయముగా శాతవాహనుడు సంకలితము చేసి ఉండలేదు, అనుట నిస్సందేహము, నిర్వివాదము. "నిజగుణశ్లాఘచేత సంతుష్టుడై, శాతవాహన భూనేత, అతివిశేషధనాదు లొసగి, నన్ను సమ్మానింపగలడు."అను లాలస, ఈసంగ్రహకర్తకు అతిశయముగా ఉన్నట్లు, ఈక్రింది గాథలవలన స్పష్టమవుతున్నది—

"తవ రణ జలదసముదయ ధయ
చలవిహ్వలపక్షై రనుశ్రియతే,
పరిశేషితపద్మశ్రై ర్హంసై రివ
మానసం రిపుభిః." గా. ౫-౩౧

"కః స్థగయితుం సమర్థోఽత్ర
జగతి విస్తీర్ణనిర్మలోత్తుంగం,
హృదయంచ తవ నరాధిప ?
గగనం చ పయోధరాన్ ముక్త్వా" ౭-౬౪

"విషమస్థిత పక్వకామ్రదర్శనే
తే తు శత్రుగేహిన్యా,
పథికానాం కః కోవా నవాఽర్థితో
రుదతి డింభేహి ?" ౬-౯౫

రాజును సంబోధించి చెప్పబడిన ఇత్యాది గాథలు - ఇవి ఒకానొక రాజు నుద్దేశించి, వానిని సంతోషపెట్టుటకై తదభిముఖముగా నిండుకొలువులో పఠింపబడినవి. అని స్పష్టముగా సూచించుచున్నవి. విమర్శించి చూడగా, అట్టి రాజు, ప్రాకృతకవికల్పతరువైన శ్రీశాతవాహనుడు కాక, మఱొకడెవడు కాగలడు ? అట్టియెడ, ఈ ప్రాకృతకావ్యకోశనిర్మాత, స్వయముగా శాతవాహనుడే అగు టెట్లు ? కీర్తికాముడైన ఏరాజుకూడా, తనచేతితో తన ప్రశంసను వ్రాసికొనడు గదా ? అంతియ గాదు;

కేవలము రాజు పేరిటనే గాక, ప్రత్యక్షముగా శాలివాహనుని పేరు ఉద్ఘాటించి కూడా, సప్తశతిలో, సాతవాహనుని కీర్తిప్రవృత్తి కూర్పబడిఉన్నది.

"ఆపన్నాని కులాని ద్వా-
వేవ హి విదతు రున్నతిం నేతుం,
గౌర్యాశ్చ హృదయదయితో
ఽథ శాలివాహననరేంద్రశ్చ."గా. ౫-౬౪

పోనిండు; సువిమర్శకుడు, నిఖిలజనసమ్మాననీయుడు, మనస్వి, అయిన శాలివాహనమహీపాలుడే, స్వయముగా తనప్రశంసను తన చేతులారా ఇలా వ్రాసికొనినాడు, అని బుద్ధిమంతు లెవరైన అనసుంకింతురా ? అది సమంజసమా ? సహృదయు లట్టివానిని అంగీకరింతురా ?

శ్రీమదభినందప్రణీత రామచరితమహాకావ్యము, 32 వ వర్గము చివర—

"హాలేనోత్తమపూజయా
కవివృషః శ్రీపాలితో లాలితః..."

అని రచింపబడి ఉన్నది పైశ్లోకము ద్వారా - పాలితుడు అనే కవిపుంగవుడు, గర్భదరిద్రుడై, ద్రవ్యాసక్తిచేత, వచ్చి, కవివత్సలుని ఆశ్రయము పొంది, సుఖియై, తత్కృతజ్ఞతాసూచకముగా, స్వప్రభువైన హాలుని పేర గాథాసప్తశతిని సంగ్రహించి ఉండవచ్చును; అని ఊహించుటకు అవకాశము లభించుచున్నది. అది నిట్టిగా అట్టిదియే అయియుండవలె. హాలుని ఆశ్రయమును పొందినవెనుకనే అతడు 'పాలితుడు' అను పేరుగన ప్రసిద్ధుడైనట్లుకూడా ఊహించవలసివస్తున్నది.

శాలివాహనుని నవతారుణ్యవిలాససంపద, విశేషవిజృంభణముతో పెంపొందుతూ ఉన్న సమయములో, ప్రాకృతభావ, పరమోన్నతస్థితి నందిన కాలములో, ఈ గాథాసప్తశతి నిర్మింపబడినది. దానినే సూచించుచుతూ, సరస్వతీకంఠాభరణము—

"కే నాస న్నాఢ్యరాజస్య
రాజ్యే ప్రాకృతభాషిణః ?
కాలే శ్రీ సాహసాంకస్య
కే న సంస్కృతభాషిణః ?"

అని పలికినది. ఆఢ్యరాజు అనగా శాలివాహనుని రాజ్యములో ప్రాకృతము పలుకనివారు, సాహసాంకుడు అనగా విక్రమాదిత్యుని కాలములో సంస్కృతము పలుకనివారు, కలికమునకైనా లేరట !

శకసంవత్సరప్రవర్తకుడైన శాలివాహనుని

(32-వ పేజీ చూడుడు)

# ఆహార సమస్య

**శ్రీ సూరి కృష్ణమూర్తి**

స్వరాజ్యం వచ్చినతర్వాత 3వ సంవత్సరం గడుస్తున్నది. ఇంకా సుమారు 2½ మాసాలలో 3 సంవత్సరాలు పూర్తి అవుతవి. స్వరాజ్యసంపాదనలో ప్రజలు ప్రదర్శించిన వుద్రేకానికీ, విజయం పొందినతర్వాత అనుభవిస్తున్న వుత్సాహానికీ సంబంధమేమీ కనపడటం లేదు.

కేంద్రసచివసంఘసభ్యుడుగా నియమితుడై అనారోగ్యం వలన పదవినింకా స్వీకరించుట కవకాశము కలుగని సుప్రసిద్ధ రాజనీతిజ్ఞుడు, మేధాసంపన్నుడు అయిన శ్రీ రాజగోపాలాచారి మద్రాసులో యిటీవల పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తూ మనదేశం 30 సంవత్సరాలక్రింద మహాత్ముడు అసహాయోద్యమం ప్రారంభించినప్పుడే స్థితిగతులలో నుండెనో యిప్పుడూ అదేస్థితిలో నున్నదని ఉద్ఘాటించాడు. ఈ అసంతృప్తికరములైన పరిస్థితులకు కారణాలను తెలిసికొని నివారణోపాయాన్ని ఆలోచించుట ప్రతి పౌరుని విధియై యున్నది.

వస్తువుల ఖరీదు హెచ్చైనందువల్లనైతేనేమి తన కొనుగోలుశక్తి తక్కువైనందువల్లనైతేనేమి వ్యక్తి తన కనీస జీవితావసరాలను కూడా తృప్తిపరుచుకోలేక పోతున్నాడు. వస్తుకొరతకమున్నూ ద్రవ్యోల్బణమున్నూ కవలపిల్లలు. ఈ కవలల పుట్టుకయే ధరల హెచ్చుదలకు కారణము. ధరలను తగ్గించాలి, ప్రజానీకంలో కొనుగోలుశక్తిని వృద్ధిపర్చాలి అంటే వస్తువుల వుత్పత్తి వృద్ధిచేయాలి. సంపదను సక్రమంగా న్యాయమైన పద్ధతులమీద అశేషప్రజకు వినియోగపర్చాలి. ఇదే ప్రజలలో రేకెత్తుతున్న అసంతృప్తివిచ్ఛేదకమార్గము.

మన జీవితానికి ముఖ్య అవసరమైనది ఆహారం. మన ఆహారసమస్య మరీ క్లిష్టంగా పరిణమించింది. ఈ సమస్య స్వరూపస్వభావాలు ఆకళింపుచేసుకుని సత్వరపరిష్కరణోపాయాన్ని విచారించవలసియున్నది.

భారతవర్షం యొక్క జనాభా 1948లో వేసిన అంచనా ప్రకారం 337 కోట్లు. 1747-48 వ సంవత్సరంలో మనదేశంలో ఆహారధాన్యవుత్పత్తి 480 టన్నులని లెక్క తేలింది. 1948-49 లోని వుత్పత్తి 450 టన్నులు. మనదేశంలో వుత్పత్తిచేసిన ఆహారధాన్యాలు గాక పరాయి దేశాలనుంచి 1947 వ సంవత్సరంలో 26 లక్షల టన్నులనున్నూ, 1948 లో 28 లక్షల టన్నులనున్నూ, 1949 లో 40 లక్షల టన్నులనున్నూ ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవలసివచ్చింది. 1950 లో దిగుమతి చేసుకోవలసిన ఆహారధాన్యం 200 లక్షల టన్నులని అంచనావేశారు. అమెరికానుంచీ ఆస్ట్రేలియానుంచీ మనదేశానికి గోధుము మొదలైన ఆహారధాన్యం సరఫరా అవుతున్నది. ఇల్లా ఆహారధాన్యాల దిగుమతులవల్ల దేశాని కపారనష్టం సంభవిస్తున్నది. 1949 వ సంవత్సరంలో రూ 150 కోట్లరూపాయలు ఆహారధాన్యదిగుమతి కొరకు వెచ్చించవలసివచ్చింది. అందులో 43 కోట్లరూపాయలు డాలర ప్రాంతములకే ఆహారధాన్యదిగుమతులక్రింద చెల్లించాము. ఈ అహారదిగుమతుల అవసరం లేకపోతే సాలియానా పైమొత్తాలు దేశాభ్యుదయంకొరకు దేశసంపదను పెంపొందించటానికి ప్రజల కొనుగోలుశక్తిని వృద్ధిపర్చటానికి పరిశ్రమల అభివృద్ధినిమిత్తం పనిముట్లనున్నూ శాస్త్రనిపుణులనున్నూ ఆయా దేశాలనుంచి తెచ్చుకోటానికి అవకాశముండేది.

మనదేశప్రజలలో నలుగురిలో ముగ్గురు తమజీవనానికి వ్యవసాయం మీద దానికి సంబంధించిన పనులమీద ఆధారపడియున్నారు. ఆహారధాన్యాలు పండే భూమి యితరదేశాలకన్న యీ దేశంలోనే ఎక్కువయున్నది. అయినప్పటికీ మన దేశప్రజలకందరికీ సరిపోయే ఆహారధాన్యం మన దేశములో వుత్పత్తికావటం లేదు.

రెండవప్రపంచమహాసంగ్రామకాలంలో బర్మా జపానువారి ఆక్రమణలోనికి వెళ్లిన తరువాత అప్పటి యీ దేశప్రభుత్వం కొన్ని లెక్కలను తయారుచేయించారు 1911 లగాయతు 1943 వరకూ మనదేశంలో సేద్యం చేసిన భూమీ, పండిన పంటా, ఆలెక్కలవల్ల తేలింది. 1911 వ సంవత్సరంలో 667 లక్షల యెకరాల భూమిమీద వరి సాగుచేశారు. 280 లక్షల టన్నుల ధాన్యం పండింది. 42వ సంవత్సరంలో 707 లక్షల యకరాల వరిసాగుకే 230 టన్నుల ధాన్యం మటుకే పండింది. ఈ ముప్పది సంవత్సరాలలో సాగుభూమి వృద్ధికాలేదు. పండే పంట నానాటికి తీసికట్టయింది. జనాభామట్టుకు యేటేటా తీవ్రవృద్ధిగా పెరుగుతూనే వున్నది.

1942 సంవత్సరంవరకూ బర్మా మన దేశంతోపాటు బ్రిటిషువారి పరిపాలనలో నున్నది. మరిన్నీ బర్మాదక్షిణప్రాంతంలో వరిపండించే పొలాలన్నీ మన దక్షిణాదినాటుకోటి చెట్టియార్లక్రింద వుంటూ వుండేవి. మనకు కావలసిన ధాన్యమంతా బర్మానుంచి సరఫరా అవుతూ వుండేది. కాని బర్మా జపానువారి ఆక్రమణలోకి వెళ్ళినందువల్లనున్నూ, జపానువారు బర్మాను ఖాళీచేసిన తరుపరికూడా అచ్చట విప్లవపరిస్థితు లేర్పడటంవల్ల చెట్టియార్లు వారి తోటలూ పొలాలు, ఆస్తిపాస్తులు వదిలివేసి యిళ్లకు చేరుకోవలసి వచ్చింది. ఇప్పటికికూడా బర్మాలో అపూర్వపరిస్థితులే నెలకొని వున్నాయి. చెట్టియార్ల వరిపొలాలు బంజర్లుగానే వున్నవి. బర్మా మనకు ఆహారధాన్యాలు సరఫరా చేసేస్థితిలోకి యిప్పటిలో రాబోదు.

బర్మా బ్రిటిషువారిపరం కావటానికిన్నీ చెట్టియార్లు బర్మాపొలాలలో వరిసాగు చేయుటానికిన్నీ పూర్వం బ్రిటిషుప్రభుత్వం మన ఆహారవిషయమై కొంత శ్రద్ధ తీసుకున్నట్లు కనపడుతుంది 19 వ శతాబ్దంలో ఇంగ్లీషువారు పెట్టుబడి పెట్టి కృష్ణా గోదావరి మొదలయిన నదుల కానకట్టలు కట్టి కాల్వలు త్రవ్వించి వ్యవసాయానికి కొంత దోహదంచేశారు. దక్షిణబర్మాలో చెట్టియార్లు వరిసాగు ప్రారంభించి మనదేశానికి ధాన్యం యెగుమతి చేయుటం మొదలెట్టిన తరుపరి మనదేశవ్యవసాయాభివృద్ధికి ప్రభుత్వం శ్రద్ధతీసుకోనే లేదు కాబట్టి ప్రస్తుత ఆహారపరిస్థితికి మొదటికారణం మనదేశంలో యిప్పటికి 50, 60 సంవత్సరాలుగా వ్యవ

సాయవిషయకమైన పెట్టుబడినిర్మాణం జరక్క పోవటం.

మనదేశంలో వ్యవసాయం ఇక్ష్వాకుల కాలంలో యే పరిస్థితులలోనూ యెట్టి పరికరాలతోనూ చేశారో యిప్పటికీ అదే పరిస్థితుల్లో అదే సాధనసంపత్తితో చేస్తున్నారు. వ్యవసాయం జీవనోపాధిక్రింద చేయుటమే గాని పరిశ్రమగా చేయబడటం లేదు. వ్యవసాయం పరిశ్రమగా చేయు దేశాలకున్నూ మనదేశమునకున్నూ యకరం 1-కి పండించే పంటను పోల్చి చూచినచో చాలా తేడా కనబడుతుంది. ఈక్రింది జాబితాలో మనదేశంలోనూ యితర దేశాలలోనూ యకరం 1-కి పండిసే ముఖ్యమైన పంటలను పౌనులలో వివరింపబడినవి.

| దేశం | గోధుమ | వరి | మొక్కజొన్న | చెరుకు |
|---|---|---|---|---|
| ఈజిప్టు | 1108 | 2998 | 1891 | 7032 |
| జపాను | 1713 | 3444 | 1392 | 47334 |
| చీనా | 989 | 2433 | 1284 | లేదు |
| జావా | లేదు | లేదు | లేదు | 113570 |
| ఇండియా | 660 | 1240 | 803 | 34944 |

మనదేశవ్యవసాయదారుని పూర్వాచార పరాయణత్వమున్నూ మూర్ఖత, చగువురాని తనం యీ హీనస్థితికి కారణాలని కొందరంటారు. దానిలో సబబేమీ లేదు. ప్రభుత్వం సహకార ముండి పట్టుదలతో ప్రచారం చేస్తే వ్యవసాయపద్ధతులను సంస్కరించుటలో వ్యవసాయదారు సిద్ధంగానే వుంటాడు. ఒక వుదాహరణ:—

1929 వ సంవత్సరంవరకూ మనదేశానికి కావలసిన పంచదారంతా యితర దేశాల నుంచి దిగుమతి అవుతూండేది. జావా మొదలైన ద్వీపాలనుంచి సాలీనా 10 లక్షల టన్నుల పంచదార మనదేశానికి సరఫరా అవుతూవుండేది. కాని ప్రభుత్వం యీ సమస్యను చేపట్టి వ్యవసాయదార్లలో పట్టుదలగా ప్రచారం చేసినవెంటనే వ్యవసాయదార్లు సహకరించి దేశానికి సరిపడే పంచదారకు కావలసిన చెరుకును పండించి పంచదారవిషయకంగా మనదేశాన్ని స్వయం పోషకంగా చేశారు.

ప్రభుత్వం కార్యదీక్ష వహించి పట్టుదలతో పనిచేస్తే వ్యవసాయదార్లలో లోటేమీ వుండదు. వ్యవసాయం పరిశ్రమగా మారుతుంది. ఇతరదేశాలతోపాటు మనదేశంలో కూడా పంటలు పండుతవి. వ్యవసాయం పరిశ్రమక్రింద మనదేశంలో చేయగలుగక పోవటానికి చెప్పే మరొక కారణ మేమిటంటే ఒక్కొక్క వ్యవసాయదారుక్రింద నున్న భూమి చాలా స్వల్ప మనీ నవీన శాస్త్రపరిశీలనలయొక్క ఫలితాలను వుపయోగపర్చుకొనుటకుగాని యంత్రసహాయం పొందుటకుగాని మన వ్యవసాయదారుకి లేదనీ, మరిన్నీ ఈలాంటిపరిస్థితులలోనే రష్యాప్రభుత్వం "కలెక్టివు ఫారం" అమలుపరచిందనీ, అట్టి విప్లవం మనదేశంలో కూడా వస్తేగాని మనధాన్యసంపద వృద్ధికాదనీ, పశుసంపద పెరగదనీ కొందరు వాదిస్తారు.

• వ్యవసాయం యంత్రసహాయమున్నూ శాస్త్రపరిశీలనయొక్క లాభం పొందటానికీ విప్లవమే అవసరం లేదు. మన సహకారోద్యమం సంస్కరించి నవీనదృక్పథానికి మళ్ళిస్తే వ్యవసాయదార్లు నవీనశాస్త్రపద్ధతులను వ్యవసాయమునకు ఉపకలవర్చుకోగల్గుతారు. • •

మన ఆహారసమస్య వెంటనే పరిష్కరింపబడవలసి యున్నది. అందుకు ముఖ్యసాధనం వ్యవసాయమునకు దోహద మిచ్చుటయే. వ్యవసాయదార్లలో నవీనశాస్త్రపద్ధతులను ప్రచారంచేయటం యెక్కువ పెట్టుబడి లేకుండా వెంటనే వుపయోగపడే "ప్రాజెక్టులను" నిర్మించటం సహకారోద్యమాన్ని సంస్కరించి అన్యోన్యసంబంధములు గల గ్రామతాలూకాజిల్లాసంస్థలను నెలకొల్పి వాటిద్వారా నవీనవ్యవసాయోపకరణములను అందరికీ అందజేయటం వ్యవసాయాభివృద్ధియొక్క ముఖ్యసాధనోపాయాలు.

పైఫలాన్ని అచిరకాలములో మనము పొందాలంటే కేంద్రప్రభుత్వశాఖయైన ఆహారశాఖయున్నూ స్థానికప్రభుత్వములకు చెందిన వ్యవసాయ, సహకారనిర్మాణశాఖలున్నూ విలీనకరణము ముఖ్యఅవసరం. ధైర్యమైనటువంటిన్నీ, ఆలోచనాపూరితమైనట్టిన్నీ, దూరదృష్టి కలిగినట్టిన్నీ కేంద్రప్రణాళిక తయారుచేయాలి.

ఇట్లు కేంద్రస్థానికపరిపాలనాశాఖల విలీనీకరణ సాధ్యమా యని కొందరు ప్రశ్నింపవచ్చును. మన రాజ్యాంగచట్టములో 11 వ అధ్యాయములో నున్న 249 వ ఆర్టికిలును బట్టి స్థానికప్రభుత్వపరిపాలనాశాఖలను కొన్నింటిని కేంద్రప్రభుత్వపరిపాలనకు ఒక సంవత్సరమునకు మించని నియమితకాలము వరకూ వదలుట కవకాశ మున్నది. 249 వ

(40-వ పేజీ చూడుడు)



# భారతదేశ సుందర దృశ్యములు





తాజ్ మహల్ : ఆగ్రా.





కీర్తిసౌధము
చితోర్ ఘర్.



# భారతదేశ సుందర దృశ్యములు

★

ఛాయాచిత్రణ:—

శ్రీ కే. జయరాం,



రాజపుటానాలో ఢిల్వారాలోని జైనమందిరము. చలువరాతితో కట్టబడినది.

కీర్తిసౌధము. ఇది చిత్తూ



పుష్కరసరస్సు—ఇది రాజపుత్రస్థానములో అజ్మీరువద్ద కొండలమధ్య కల







ుదుర్గములో కలదు. ఇప్పటికిని చాలాబలముగా నున్నది.

చిత్తూరులోని విజయస్తంభము (జియారత్ నిర్మించినది.)



రాజపుటానాలోని అబూ పర్వతముల దగ్గరనున్న ధిల్వారా లోని జైనమందిరము చలువ రాతితో కట్టాడినది.





ఆగ్రాదుర్గములోని షాజహాన దర్బారుహాలు చలువరాతితో కట్టాడినది.

# శ్రీనివాసరామానుజం

శ్రీ సంధ్యావందనం నాగేశ్వరరావు

హిందూదేశములో గొప్ప గొప్పగణిత శాస్త్రవేత్తలు, ఆర్థిక వేత్తలు వేదాంతశిరోమణులు, విద్వాంసులు జన్మించారు. వీరు యూరోపుదేశములవారితో నేమాత్రము తీసిపోలేరు. మన హిందూదేశపు ప్రాచీనపరిస్థితులు చూస్తే ఆర్యభట్టు భాస్కరాచార్య మొదలగువారు బీజగణితానికి క్షేత్రగణితానికి పునాదులు వేసి స్పష్టీకరించిరని చెప్పవచ్చును. పాశ్చాత్యులు మానవులవలె గాక పశుతుల్యులై అడవులయందు సంచరించు తఱిని ప్రాచ్యదేశములగు హిందూదేశము, చైనాదేశములు వ్యాపారఒడంబడికలు చేసి కాని రాజకీయంగా వైజ్ఞానికంగా నైతికంగా నుచ్ఛస్థాయిలో నుండిరి. ఆకాలమునందే శిల్పకళలు. కవితాపోషణాశాస్త్ర పరిశోధనలు జరిగినవి. 19 వ శతాబ్దిలో ప్రపంచగణితశాస్త్ర శిరోమణి యని వన్నెకెక్కిన పురుషుడు రామానుజం. భారతావనియందలి ప్రతివ్యక్తి అతనిజీవితమును చదువ తీరవలసినదే.

అతని పూర్తిపేరు శ్రీనివాసరామానుజం అయ్యంగార్. అతడు 1887 డిసెంబర్ 22 తారీఖున జన్మించాడు. అతని తండ్రి పెద్దతండ్రులు కడుబీదలు. కుంభకోణములో జవుళీవ్యాపారస్థులవద్ద గుమాస్తాలుగా పని చేయుచు, తమ ఆలుబిడ్డలను ఏదోఒకవిధముగా పోషించుచుండిరి. రామానుజం పుట్టుక, శ్రీవివేకానందాది దివ్యపురుషుల పుట్టుకలవలె విచిత్రగాథ కలిగియున్నది. రామానుజం తల్లిదండ్రులకు పెక్కేండ్లవఱకు పుత్రప్రాప్తి లేకుండుటచే తీరని వ్యథకలిగి అనేకసంవత్సరములు పుత్ర సంతానము కొఱకు వరుకటిలోనుండే "నమగిరి"స్వామిని సేవించిరి. ఆదైవానుగ్రహముచే గొప్ప గణితశాస్త్రసంపన్నుడగు శ్రీనివాసరామానుజం వారికి కలిగెను.

బాల్యదశలో నతని విద్యాభ్యాసము చూస్తే అతడింత గొప్పవాడవుతాడా అను సందేహము ప్రతివ్యక్తికీ కలుగుతుంది. అయినను, ఒక్క గణితమునందు మాత్రము అతనికి గొప్పఉత్సాహము, ఆసక్తియుండెడిది. గణితశాస్త్రములోని ఉన్నతాదర్శములు ఉత్కృష్టసత్యాలు. కనుగొనవలయుననియెడి తీరని కోరిక యుండెడిది. బాల్యదశలోనే రామానుజం తోడి మేటి విద్యార్థులకు, ఉపాధ్యాయులకుగూడ గోచరింపని క్లిష్ట సమస్యలను కూడ అవలీలగా పరిష్కరించి వారి నందఱిని యబ్బురపెట్టేవాడు. నాల్గవ ఫారమ్‌నకు వచ్చే లోపలనే రామానుజం ఇంటర్‌మీడియట్‌లో నేర్పబడు Arithmetic, Geometric, Harmonic Progressions ఆమూలాగ్రంగా చదివివేసినాడు. అతడు కొన్నిసమయాల్లో బి. ఏ విద్యార్థులకు చేయూతనొసంగెడివాడట...

*P.V.* శేషు అయ్యర్ గారికి రామానుజం తోడి విద్యార్థి ఇలా వ్రాశాడు. "రామానుజం మాకందఱికి ఆదర్శజీవి. అతడు కళాశాలగ్రంథాలయమునుండి ***Carr's Synopsis of pure Geometry*** అను పుస్తకమును తీసికొనిపోయి అందలి సూత్రములను సమస్యలను నిశితదృష్టితో చూచి, వానిలోని సమష్టితను నిరూపించెడివాడు. అతడు వివేకానందునివలె ఏకసంథాగ్రాహి. సంస్కృతశ్లోకాల నెన్నెటినో అవలీలగా కంఠస్థము చేయగలిగాడు. 2, *II* (3 1/7, *E* (2. 134) లవర్గమూలములను ఎన్ని దశాంశస్థానములవఱకైనను చెప్పేవాడు. అతడొక నిరాడంబరజీవి.

ప్రొఫెసర్ జి. హెచ్. హార్డీ రామానుజం యొక్క అశేషజ్ఞాపకశక్తిని మరి మరి పొగడేవాడు. రాయల్ సొసైటీ వారందరు అతనిని వేనోళ్ళ పొగడేవారు. లండన్ గణితశాస్త్రసంఘమువారు ఇలా వ్రాశారు. "అతని కపరిమిత అశేషజ్ఞాపకశక్తి వుందనుటలో అతిశయోక్తి లేదు."

ప్రొఫెసర్ లిటిల్‌వుడ్ గారి దృష్టిలో గణితశాస్త్రమందలి సంఖ్యలు, బీజగణితాక్షరములు అతని స్నేహితులు. వాని నెప్పుడు మాట్లాడించేవాడు. రామానుజం తన అశేషగణనాశక్తిని జ్ఞాపకశక్తిని అనేకసందర్భములలో చూపెట్టగలిగాడు. అందులో నొక సంఘటనను ప్రొఫెసర్ హార్డీ ఈవిధంగా చిత్రించాడు. "నేనొకప్పుడు 1729 నంబరుగల టాక్సీమీద రామానుజంగారింటికి పోయాను. అతడు జ్వరముచే బాధపడుతూఉండెను. నేనేమో పొరపాటున అతనిని మామూలుమనిషిగా భావించి హేళనసమస్యలతో మాట్లాడించాను. '$7 \times 13 \times 19$ అను లబ్ధము (=1729, టాక్సీ నంబరు) నాకేమీ నచ్చలేదు. అయినను 'ఆ సంఖ్య దుశ్శకునమును చూపునా' అని ప్రశ్నించాను. నూతనోత్సాహముతో తటాలున లేచి రామానుజం 'అబ్బే! అదియెంత సొగసైనసంఖ్య! రెండుసంఖ్యల ఘనముల మొత్తముగా చెప్పబడే సంఖ్యలో 1729 ($7 \times 13 \times 19$) ఒకటి. [$12^3 + 1^3 = 1728 + 1 = 1729$] అని సమాధానమిచ్చాడు. నేను నిశ్చేష్టుడైపోయ్యాను. నాకేమీ తోచక మరలఎన్నెన్నో సమస్యలను అతనిచే పరిష్కరించుకొంటిని.

• అతని జీవితంలో ప్రథమమున అతనికి ***Synopsis of pure Geometry*** లభించిన తోడనే ఒకవిధమైన ఉత్సాహము సంతోషము కలిగినవి. ఆ పుస్తకములోని క్షేత్రగణిత సిద్ధాంతములు, నిర్వచనాలు అతనిని స్వర్గసీమకు తీసికొనిపోయాయి. రామానుజం తరువాత అంత గొప్పగణితశాస్త్రవేత్తగా పరిగణింపబడుటకు ఆ అమూల్యపుస్తకరత్నమే కారణమని చెప్పవచ్చును. గణితశాస్త్రమువెడ అతనికి గల విశేషాభిమానము, దానియందలి గూఢార్థములను తెలిసికొనవలయుననియెడి యెడతెగని వాంఛ అతనిని యితర విషయాల్లోకి మరలించేది కాదు. అహర్నిశలు అతనికి వైష్ణభక్తులకు దైవసంకీర్తన లెట్లో "గణితం" "గణితం" అనే స్మరణే. గణితశాస్త్రాంబుధిని మథించి అందుండి ఉద్భవించిన అమృతాన్ని కడుపార గ్రోలి ఆనందపరవశుడగుటకు ప్రయత్నించాడు. అతని

కళాశాలజీవితమంతా అందుకే వ్యర్థము చేసుకున్నాడు. అదృష్టవశాత్తు లభించిన స్కాలర్‌షిప్ గోల్పోయినాడు. ఇంటర్‌మీడియట్‌లో మొదటి సంవత్సరమే తప్పిపోయినాడు. 1907 సంవత్సరము డిసెంబర్ పరీక్షలలో తప్పిపోయినాడు. గణితశాస్త్ర పరీక్షలోనే కనిష్టమార్కు రాలేదు. ఇది యొక విచిత్రవిషయము. పరీక్షాపత్రములో నెన్నో ప్రశ్నలుంటే, మన రామానుజం ఏ ఒక రెండు ప్రశ్నలకు గైకొని వాని నెన్ని విధములుగా చేయవీలగునో అన్నివిధాలుగా చేసి చూపించేవాడట... గణితపరీక్షాధికారులు ఆశ్చర్యచకితులై తమనుసహితము రామానుజం మించియున్నాడని భావించిరి. కాని అతను చేసిన ఆ రెండు మూడు ప్రశ్నలకు మాత్రము మార్కులు యిచ్చుటచే తన యభిమానపత్రంలోనే రామానుజం తప్పిపోయేవాడు.

1909 సంవత్సరమువఱకు తన జీవితము నెట్లు గడుపుటకూ తోచక నిరాశావశుడై తపించిపోయాడు. "ధనమూలమిదమ్ జగత్" అనునది అతని కొక గడ్డుసమస్యగా నెదుర్కొనినది. అయినను ఆ అశాంతి, ఆ వేదన సమయాల్లోగూడ గణితశాస్త్రసమస్యలను రెండు గొప్ప నోటుపుస్తకములందు నింపివేశాడు. ఆ పుస్తకద్వయమే ప్రొఫెసర్ హార్డీకమూలసంపత్తుగా తయారయింది. రామానుజం 1909 మే; జూన్‌లలో వివాహితుడయినాడు. గృహస్థుడయినందున తన భార్యాపుత్రులను పోషించుటకు ధనార్జనకు పెక్కు ప్రయత్నములు చేశాడు. అతని ప్రయత్నములన్నిటిని *P. V.* శేషు అయ్యర్ ఈవిధంగా వర్ణించాడు. తిరువక్కూర్ అను చిన్నపట్నంలో గణితశాస్త్రసంఘస్థాపకుడగు *V.* రామచంద్ర అయ్యర్‌ను చూడటానికి రామానుజం పోయాడు. అతడు రామానుజంయొక్క గణితశాస్త్రసంపత్తికి అపరిమితానందము నొంది బుజ్జగించి నాదగ్గఱికి పంపాడు. నేను అతని అమూల్యపుస్తకద్వయమును చూచి నిర్ఘాంతపడిపోయాను. మన దక్షిణ హిందూదేశములో నిటువంటి మణి ఉద్భవించినదని తన్మయత్వమునొంది ఆనందాంబుధిలో తేలిపోయాను. మంచి సిఫారసుపత్రముల నిచ్చి రామానుజంను నెల్లూరు కలెక్టరు *R. R.* రామచంద్రరావుదగ్గఱికి పంపాను. రామచంద్రరావు గాఢంగా పరిశీలించి ఆశేషబుద్ధివికాసము, గణితశాస్త్రమందభి సూక్ష్మబుద్ధిగల రామానుజంను గుమాస్తావృత్తిలో ప్రవేశపెట్టుట కిచ్ఛపడక అతని జీవితావసరములకు వలయు పైకము తానే యిస్తానని వాగ్దానమిచ్చి తిరిగి మద్రాసుకే పంపాడు. ఈసంఘటన 1910 లో జరిగింది. రామానుజం ఇతరులమీద పూర్తిగా ఆధారపడి బ్రతకటం అంత సబబుగా నుండదని తలచి "ఉద్యోగం పురుషలక్షణం" కావున మద్రాసుపోర్టుట్రస్టులో నొక యుద్యోగము సంపాదించెను. కొంతకాలముతరువాత డాక్టర్ *G. T.* వాకర్ (*F.R.S*) అను నక్షత్రశాస్త్రజ్ఞుడు మద్రాసుకు చనుదెంచినపుడు మద్రాసు పోర్టుట్రస్టు అధ్యక్షుడగు సర్ ఫ్రాన్సిస్ స్ప్రింగ్ (*K. C. I. E.*) రామానుజంను ఆ నక్షత్రశాస్త్రజ్ఞునకు చూపించాడు. వాకర్ రామానుజంయొక్క అంతరంగిక గణితశాస్త్రసంపత్ప్రభావమును సులభంగా గ్రహించి అబ్బురపడిపోయెను. మద్రాసు విశ్వవిద్యాలయాధికారుల చెంతకు రామానుజంను తీసికొనిపోయి చూపించాడు. ప్రభుత్వమునకుకూడ రామానుజంయొక్క ప్రతిభను చూపెట్టగలిగాడు. తత్ఫలితంగా మద్రాసుప్రభుత్వంవారు రామానుజంనకు నెలకు 75 రూపాయల చొప్పున పరిశోధనా స్కాలర్‌షిప్ రెండుసంవత్సరములవఱకు నిచ్చుట కనుమతించిరి. రామానుజంనకు ధనార్జన పేచీ లేకపోవుటచే అప్పటినుండి గణితశాస్త్రపరిశోధనలకే కాలమునంతయు వ్యయము చేయుచుండెను. 1913 వ సంవత్సరము జనవరి 16 వ తేది రామానుజం ప్రొఫెసర్ హార్డీకి ఇవిధంగా వ్రాశాడు:

"నేను మద్రాసు పోర్టుట్రస్టుశాఖలో నొక పేద గుమాస్తాను. నాకు నెలకు ఇరవై రూపాయలు జీతము. నావయస్సిప్పుడు 23 సంవత్సరములు. నాకేమంతగా కళాశాలవిద్య లేదు. మామూలుగా ఉన్నతపాఠశాలయందు చదివినాను. చదువులంతా ముగించుకొనినతరువాత నాకేవిధమైన వుద్యోగము లభింపని గణితశాస్త్రసమస్యలను పరిష్కరించుచు కాలహరణము చేయుచుంటిని. సామాన్య గణితశాస్త్రవేత్తలవలె ఒక నియమపద్ధతిలో విహరించుటలేదు. నా స్వేచ్ఛానాడులలో విహరించుచున్నాను. *Divergent Series* పై పరిశోధన జరిపాను. అందులోని ఫలితాలను నాకు తెలిసిన మేటిగణితశాస్త్రజ్ఞులచే సరియైనవని నిరూపింపగలిగాను, వారందరు నా సమస్యాఫలితాలను చూచి నివ్వెఱపడిపోయారు. మీరుకూడ నే పంపుచున్న సమస్యలను సిద్ధాంతములను పరిశీలించి అవి బాగున్నవని మీకు తోచిన అవి ప్రకటింపబడవలయునని నా హృదయపూర్వకవాంఛ. అందులకు నేను మీకెంతో కృతజ్ఞుడగుదును. కడు బీదస్థితిలో నున్నాను. పైగా అనుభవశూన్యుడను గావున నావిషయములో శ్రద్ధబూని చేయూతనొసంగెదరని కోరుచున్నాను." ప్రొఫెసర్ హార్డీ



చకోస్లోవేకియాలోని భారతరాయబారి శ్రీ యన్. రాఘవన్ ఏప్రిల్ 4 నేడు, చకోస్లోవేకియా, ఇండియాల వాణిజ్య ఒడంబడికపై చేవ్రాలు చేస్తున్నారు.

రామానుజం వ్రాసిన లేఖను పంపిన సిద్ధాంతములను పరిశీలించి సంతోష పరవశుడయినాడు. అప్పుడే రామానుజంజీవితములో నొక క్రొత్త మార్పు కలిగింది. రామానుజంను ప్రొఫెసర్ హార్డీ అమెరికాకు ఆహ్వానించాడు. కాని రామానుజం సనాతన బ్రాహ్మణాచారనిష్ఠాపరుడగుటచే నవీన అనాచారపాశ్చాత్యప్రపంచములో కాలు పెట్టుటకు వెనుకంజవేసినాడు. కడపటికి ఆహ్వానమును సమ్మతించి, కేంబ్రిడ్జికు బయలుదేరెను. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయము లోని గణితశాస్త్రవేత్తలకు తన అపూర్వ పరిశోధనలచే విభ్రాంతి కలిగించెను. ట్రినిటీకాలేజి గణితశాస్త్రజ్ఞుడు నెవిల్లీ మద్రాసుకువచ్చినపుడు రామానుజంను యిలా ప్రశంసించాడు. "నేటికాలములో మద్రాసు రాజధాని నివాసియగు శ్రీనివాసరామానుజంగారిని మేమంతా గుర్తించినామంటే గణితశాస్త్రప్రపంచములో ఒక నూతనోత్సాహము, నూతనావేశము, సుమంగళ వైభవము ప్రారంభమయిందన్నమాట. అతని గణితశాస్త్ర గరిమను పొగడుటకు ఆ వేనోళ్ళు గల ఆదిశేషునకు తప్ప మరెవ్వరికి తరము? రామానుజం చిరస్మరణీయుడు. అటువంటి మేటి చుక్కను మీమధ్య కలిగియుండుటకు మీరెంతో గర్వించి సంతోషించవలసినవారు."

నెవిల్లీ గారి యుద్బోధవాక్కులు సార్థకములయినాయ్. రామానుజం ప్రపంచములోని ముఖ్యదేశములలోనంతా గ్రహింపబడ్డాడు. పాశ్చాత్యులందరు రామానుజంకు జేజేలొసంగి ఉన్నతపీఠాన్ని ఒసంగిరి.

1914 వ సంవత్సరము మరల రామానుజం కేంబ్రిడ్జికు పోయాడు. కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయమువారు రామానుజంనకు, 60 పౌనులు గౌరవంగా నిచ్చిరి. అహంకారోన్మత్తులగు గణితశాస్త్రవేత్తలకు రామానుజం యొక బల్లెపోటుగా నుండెడివాడు. వారి నప్పుడప్పుడు తికమకలాడించి గుటకలు మ్రింగించేవాడు. అతని సమస్యాపరిష్కారములు సాధారణంగా నెవ్వరికి గోచరించేవి కావు. ప్రొఫెసర్ హార్డీ, లిటిల్‌వుడ్ గార్లు అతని సిద్ధాంతములను, సమస్యలను ప్రచురింపజేశారు. వారి సహాయముచేతనే రామానుజం తన అంతరంగిక మేధాశక్తిని పుస్తకములద్వారా ప్రపంచానికంతకును బాహాటము నొనర్పగలిగాడు. అప్పటి బ్రిటిష్‌పాలనయుగములో జన్మించి వన్నెకెక్కిన భారతీయులలో రామానుజం ఉన్నతపీఠాన్ని అలంకరించాడు. జూలియన్‌హక్స్లీ తన వ్యాసాల్లో ఒకచోట రామానుజం ఒక్కడే 20 శతాబ్దిలో గణితశాస్త్రసింహాసనాన్ని అధిష్ఠించినాడని వ్రాశాడు. బీజగణితసూత్రములు, *Transformation of infinite series* వీనిలో రామానుజం నిరుపమానపాండిత్యమును సంపాదించినాడు. మేటిగణితశాస్త్రసంపన్నులగు యూలర్, జాకొబిగార్లతో రామానుజను పోల్చవచ్చును. 30 ఏండ్లనాడే రామానుజం ఫెలో ఆఫ్ రాయల్ సొసైటిగా (*F R. S*) ఎన్నుకోబడ్డాడు. ఫెలో ఆఫ్ ట్రినిటీకాలేజి కేంబ్రిడ్జిగా కూడ తీసికోబడ్డాడు.

రామానుజంలాంటి మేటి వ్యక్తుల జీవితాలు చాలకాలము గడువవు. వారి జీవితాన్ని అతిత్వరలో తీసికొనిపోతాడు పాడుదేవుడు. మృత్యుదేవత సోమరులను లోభులను యుద్ధాభిలాషులను, సామ్రాజ్యాధిపతులను తీసికొనిపోదు. నిశాంతిమూర్తులగు గాంధీజీలను, వేదాంతశిరోమణులగు వివేకానందులను, గణితశాస్త్రసంపన్నులగు రామానుజంలను అచిరకాలములోనే ఈ ప్రపంచమునుండి దాటిపోనిస్తుంది ఆమృత్యుదేవతయే. ఇది బ్రహ్మప్రేరేపణ. శివుని లయ. రామానుజంజీవిత మంతమగుటకు వచ్చింది. మృత్యుముఖానికి దారితీయు పాడువ్యాధి అతనికి దాపరించింది. ఎన్నెన్నో, ఆసుపత్రులు, శానిటోరియమ్‌లు తిరిగాడు. బ్రహ్మరాత నెవరు తప్పింపగలరు? కాలదేవత అతన్ని లోకాన్నుండి తీసికొనిపోదలచినపుడు ఇంద్రాదిదేవతలయినను, "నమగిరి"స్వామి అయినను ఏమిచేయగలరు? కడపటి కనుమూపుందేవరకు గణితమందు క్రొత్తక్రొత్తవిషయాలు కనిపెట్టగలిగాడు శ్రీనివాసరామానుజం. తన జీవితకాలాన్ని వృథాపుచ్చక భారతమాతకు సుపుత్రుడై పుత్రోత్సాహము కలిగించి 1920 ఫిబ్రవరి 6 వ తారీఖున ప్రపంచగణితశాస్త్రకోవిదుడు కన్నులు మూశాడు. భారతదేశపు మేటి వజ్రములలో నొకటి ప్రక్కలైపోయినది.

గణితశాస్త్ర ప్రపంచానికంతా అతని మరణము తీరని దుఃఖాన్ని కలిగించింది. దేవుడింకను అసువుల నిచ్చియుండిన రామానుజం గణితములో మరేమి యింద్రమహేంద్రజాలములనుసృష్టించెడివాడో! విద్యార్థియౌవనదశలందే అతనికి చేదోడు ధనసహాయముండియున్నచో అతడు మరెంతటి ఘనుడయ్యెడివాడో చెప్పతరమా. జవహరలాల్ నెహ్రూ తన *Disocvery of India* లో ఈ విధంగా వ్రాశాడు. "హిందూదేశపు అప్పటి బానిససంకలితమైన పరిస్థితులు రామానుజంయొక్క కొద్దికాలపు జీవితాన్ని అతని అకాలమరణం ప్రతిబింబింపచేస్తాయి. కోట్లకొలదిప్రజలలో ఏకొద్దిమందికో విద్యాప్రాప్తి కలుగుటకు వీలున్నది. ఆవిద్యాభ్యాసముచేసినవారిలో చాలమంది ఏ ఆఫీసులోనో గుమాస్తాలుగా జీవితపర్యంతరము కష్టించవలసిందే! ఇంగ్లండులో నుండే నిరుద్యోగి, సోమరులకుగల ఆదాయముకన్నా [illegible] కష్టించి చెమటగార్చి పనిచేసే భారతదేశపు గుమాస్తాజీతము తక్కువ. ఇట్లు దారిద్ర్య, బానిస పిశాచములచే భారతీయులు విద్యలేక తమలో దాగియుండెడి ప్రజ్ఞావిశేషములను ప్రపంచానికి చూపెట్టలేకపోయారు. మంచి ఆహారము, ధనము, సదవకాశాలే ఈ భారతపుత్రులకు లభించినచో వీరిలో నెందరు ఆర్థికవేత్తలు శిల్పులు, చిత్రకారులు, కవిపుంగవులు బయలుదేరరు! అటువంటివారున్నదేశమే ప్రపంచములో ఖ్యాతి యశస్సులు గడిస్తుంది. నవీన భారతదేశాన్ని, నవీన ప్రపంచాన్ని పునరుజ్జీవింపచేయుటకుపై అవకాశాలు భారతీయులకు కల్పించవలయును."

ఆపండిట్ నెహ్రూజీ యిప్పుడుస్వతంత్ర భారతప్రజాస్వామికప్రభుత్వానికి ప్రధానామాత్యుడు. ప్రపంచపౌరశ్రేష్ఠులలో ప్రథమపాత్రను ధరింపబోవుచున్నాడు. "*Discovery of India*" లో చెప్పినట్లు నెహ్రూజీ ఇప్పుడు అటువంటి రామానుజంలను, రవీంద్రులను, వివేకానందులను అజ్ఞాత ప్రపంచమునందుండి బహిః ప్రపంచానికి తీసికొనిరావచ్చును.

(ఆధారము, మాడరన్ రివ్యూ)

---



# బాలానందం

## 'అపిచ'

'అపిచ, కించ, తథాపి, తత్రాపి-' ఇవన్నీ సంస్కృతభాషలో అవ్యయరూపాలు. ఇప్పటికీ కాస్త ఆసంస్కృతభాషాసంస్కారం కల వారు నిత్యవ్యావహారికంలో వీటిని ఉపయోగించి మాట్లాడ్డంకూడా వుంది. అట్టివారిలో మన రామ శాస్త్రిలుగారు ప్రప్రథములు. ఏమంటే? వారికి ఆ దేవభాష అనే అభిమానం, ఆపట్టుదలా పట్టి అన వలసివుంటుంది. ఇందువల్ల పైవారి మాట యెలా వున్నా పాపం భార్య పార్వతమ్మగారికి మాత్రం ప్రాణం సంకటంగా వుంది. ఆమె బొత్తిగా చదువుకోలేదు; అంతా పూర్వపు రకం.

ఒహానాడు రామశాస్త్రిలుగారు 'ఈ వాళ వ్యంజనాలు ఏమి చేశా' వనేసరికి ఆమెకు అర్థంకాక 'నేనవేమిటో ఎరుగనండీ, ఎప్పుడూ చూడలేదుకూడాను' అన్నదావిడ. దాంతో రుద్రుడైపోయాడు శాస్త్రిలుగారు. ఏడిసినట్టే వుంది పురాణం వారింట్లో పుట్టా వన్నమాటే గాని వ్యంజనశబ్దార్థం తెలియదు, పట్టి వజ్రశుంఠవి. వ్యంజనాలంటే శాకపాకాలు. యిన్నాళ్ళనుంచి నాతో కాపరం చేసినందుకేనా సంస్కృతభాష పట్టుబడలేదు. ఈ మాటలు వినేసరికి ఆవిడకు వొళ్లు చచ్చిపోయినట్లయింది పాపం! కాని యేం చేస్తుంది?,

ఇంకోనాడు మధ్యాహ్నం భోజనాలయాక సావకాశంగా కూర్చున్నప్పుడు; పార్వతమ్మగారు, 'ఏమి

శ్రీమతి రావిపాటి రమాబాయి

టండీ ప్రతివాళ్ళతోను ఆ సంస్కృతం మాట్లాడితే వాళ్ళకి తెలియవద్దూ? మొన్న మన పాలేరుతో పొలంలోనుంచి లవిత్రం పట్టుకు వచ్చావా? లేదా? అనేసరికి వాడు కిర్రిబిక్కిరి అయిపోయి నిలువుగుడ్లు వేశాడు. అలా కాకపోతే కొడవలి తెచ్చావా? లేదా? అని అడగరాదూ చెప్పండి. కాకపోయినా పెద్దతనం వచ్చిన కొద్దీ ఛాదస్తం యెక్కువ అయిపోతూందమ్మా! యేలాగో కాని?

అంటూండగానే బట్టల వర్తకుడు సోమలింగం-'చాస్తుల్లు బాబుగారూ! మాంచి చాపులు, చీరలు వున్నాయండి తమరోసారి చిత్తగించాలండి బాబూ' అంటూ మూటలిప్పాడు.

కాని శాస్త్రిలుగారి ఒడ్డుపొడుక్కి తగ్గ చాపులు లేకపోయాయి. 'నాకో మంచి చీర తియ్యండి' అంటూన్న పార్వతమ్మ గారిమాట వినిపించుకోకుండానే 'చీరలక్కరలేదోయి, కాని నేను పురమాయిస్తాను ఆప్రకారం చాపు ఒకటి నేయిస్తావూ? నివడిగిన ఖరీదు యిస్తానుమరి' అన్నారు శాస్త్రిలు గారు. వారంనాటికి దాఖలుచేసుకొంటా. బాబయ్యగారికి ఏలా ఉండాలో చెప్పండి.

చెప్తాను విను అరవై నెంబరు



పడుగు–పేక లుండాలి. అపిచ, ఎనిమిదిన్నర గజాల పొడ్వు వుండాలి; అపిచ, ఏభైనాలుగంగుళాల వెడల్పుండాలి; అపిచ, ఎఱ్ఱంచుపెట్టాలి; అపిచ నేత నఖుంవెర్రి వుండరాదు. బాగా విన్నావా? ఇందులో ఏది లోపించినా ఒక్క కానీ కూడా యివ్వను వెళ్లుమరి. అమ్మగారి కో–క–మా–' అంటూంటే 'కోకా లేదు దేకాలే' దని శాస్త్రిలుగా రురిమే సరికి వీధిలోకి ఒక్కగంతు వేశాడు సోమలింగం.

దొడ్డిగుమ్మశల్లోంచి 'సోమలింగం' అన్న పిలుపు వినబడేటప్పటికి వెనక్కి తిరిగి చూచేసరికి సోమలింగముకు పార్వతమ్మగారు ప్రత్యక్షమయ్యారు. వెంటనే అమ్మగారూ! బాబయ్యగారు తమచీరప్రసక్తనియ్యలేదండి మంచిచీరలున్నాయండి? పోనీ లేవోయి, సోమలింగం, నాకు చీర అక్కరలేదు కాని వారు పురమాయించిన పంచలచాపుసంగతి నీకు తెలిసిందా లేదా? లేదా తేడావస్తే కానీకూడా యివ్వ నన్నారు. పైగా కోపదారిమనిషి. తిట్లుకూడా తిడతారు. వారు చెప్పిన నాలుగు "అపిచలు" ఎక్కడ ఏలా పెట్టాలో నీకు తెలుసునా మరి. పంచెలచాపుకి నాలుగు చోట్ల జానెడేసి మేర నేడమాన్చేయాలి. ఆలా గైతేనే కాని దేవతార్చనకు పనికిరాదు. జ్ఞాపకం వుంచుకో. నే వెడతాను' అని చెప్పి తలుపేసుకొన్నారు పార్వతమ్మగారు. తిట్లు తప్పాయని పరమానందభరితు డయ్యాడు సోమలింగం.

'మహాపనివానితనంగా నేయించావోయి పంచెలచాపు సోమలింగం! ఖరీదుమాట చెప్పు, శాస్త్రన్యాయంగామాత్రం చెప్పు;

తమ రెరగని దేముంది బాబూ! గజంరూపాయలు యిప్పించండి బాబూ!' అంటూ మడత విప్పి ఇది గోనండి తమరు శెలవిచ్చినప్రకారం నాలుగు "అపిచలు" ఎంత సంతనాదుగా పెట్టించానో చూడండి బాబూ! అమ్మగారుకూడా చెప్పారు మరిచిపోవద్దని. ఏమండి అమ్మా, యీవాలాగేనాండి తమరు పెట్టించమన్న'దంటూ శాస్త్రులుగారికి ఒంటిపొరనిచాపు విప్పి చూపించాడు సోమలింగం.

ఆశి, నీ బొడ్డు పొక్కా! నీకే పుట్టిందటే యీ పోయేకాలం' అంటూ లేవబోయేసరికి 'చాల్లేండి, ఎందు కొచ్చిన కోపం. యిన్నాళ్లు మీతో కాపరంచేసినా "అపిచ" శబ్దార్థం తెలిసిందికాదు నాకు ఇంతకీ ఖర్మం!' అంటూ వంటింట్లోకి వెళ్ళిపోయింది పార్వతమ్మగారు.

నవ్వుకుంటూబట్టలమూటట్టుకొని వీధిలోకి పోయాడు సోమలింగం. రామశాస్త్రులుగారు మాత్రం భోజనంవేళ అయేదాకా కుర్చీలోంచి లేచినజ్ఞాపకం లేదు.

---





ఈనెల 7-వ తేదీన రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్ ప్రభుత్వ 'గృహనిర్మాణ ఫ్యాక్టరీ' సందర్శించినపుడు చిత్రం. ఫ్యాక్టరీ ఉద్యోగులు అధ్యక్షునితో కరస్పర్శచేస్తూ పరిచయం చేసుకొంటున్నారు.

బాలానందం సీరియల్:



మూలం: ట్రెజర్ ఐలండు
రచన: ఆర్. యల్. స్టివెన్సన్

## 2

అనుకరణ:
"నళినీ మోహన్"

ట్రెలానీ కొన్న ఓడపేరు 'హిస్పనోలా'. ఆయనే దానిని నడిపేటందుకు జనాన్నికూడా కుదిర్చేడు. దూరప్రయాణానికి అవసరమైన సామగ్రిని సమకూర్చేడు. అనుకున్నరోజుకి గనక మేము తిరిగి రాకపోతే మరొక ఓడతో సాయం పంపించమని తన ముఖ్యస్నేహితుడికి ఒకడికి పురమాయించేడు. అన్నీ బాగానే ఉన్నాయి.

కాని, మొదట అనుకున్నట్లుగా మా ప్రయాణానికి కారణం ఏమిటో రహస్యంగా ఉండిపోలేదు. ఎక్కడికి వెడుతున్నామో తెలియదు కాని, ఫ్లింట్ పాతేసిన నిధికోసం వెడుతున్నామని ఊరంతా పొక్కిపోయింది. దీనికితోడు ట్రెలానీ కుదిర్చిన వారిలో 'జాన్ సిల్వర్' అనే కుంటివంటవాడొకడు ఉండడం చూసేసరికి నాకు కెప్టెన్ బిల్ మాటలు గుర్తువచ్చేయి. దానికి తోడు సిల్వర్ నడుపుతూన్న హోటలులో ఒకరోజున ఒక ముఖం కనబడేసరికి మరీ అనుమానం వేసింది. కెప్టెన్ బిల్ చేత దెబ్బలు తిని, చావు తప్పి కన్ను లొట్టపోయి పారిపోయిన కళాసు అతడే. వెంటనే ఆ సమాచారమూ, నా అనుమానమూ డాక్టరుతో చెప్పేను. కాని సిల్వర్ మహాతెలివైనవాడు. తానేమీ ఎరగనట్లు నటించాడు. మాతో ఇచ్చకాలాడేడు. ఆతని మీద అనుమానం లేకుండా చేసుకున్నాడు.

కాని, ట్రెలానీ కుదిర్చిన ఓడ కెప్టెన్‌కు మొదటనే మిగిలనకళాసుల మీద అపనమ్మకం కలిగింది. వారి మాటలూ, చూపులూ చూసి వారిని నమ్మడానికి వీల్లేదని ఖచ్చితంగా చెప్పేడు. ట్రెలానీ ఆయన మాటలను నమ్మలేదు. కాని, ఆయన పట్టు వదలక, తన ఉద్యోగం వదులుకుంటాననడంచేత, తప్పనిసరియై కొన్నిమార్పులకు ఒప్పుకున్నాడు.

ట్రెలానీతో మొదటినుంచీ నమ్మకమైన బంట్రోతులు ముగ్గురికీ, కెప్టెన్‌కూ, డాక్టరుకూ, నాకూ ట్రెలానీగదికి పక్కపక్కలనే ఉన్న గదులలో మకాం ఇప్పించేడు. మిగిలినవారందరికీ ఓడముందుభాగంలో ఒకగదిలో మకాం ఇప్పించేడు. ఓడలోకి తెచ్చిన తుపాకులనూ మందుగుండుసామగ్రినీ మా గదులమధ్యకు చేర్పించాడు. ఈ విధంగా ఆయన ముందుముందు కళాసులు తిరగబడ్డా కాచుకునేటందుకు వీలుగా ఏర్పాట్లన్నీ చేసుకున్నాక గాని ఓడను బయలుదేరనివ్వలేదు.

ఏవిధమైన ఒడుదుడుకులూ లేకుండా మొదట చాలా రోజులు మా ప్రయాణం బాగానే సాగింది. కళాసులంతా ఎంతో నమ్మకంగా ఉన్నారు. అది చూసేక కెప్టెన్‌కి కూడా విశ్వాసం ఏర్పడింది.

ప్రయాణం ఆఖరిరోజున సాయంకాలం నేను సామానులపెట్టెపక్కని పడుకుని నిద్రపోతూండగా పక్కనే మాటల చప్పుడు విని తెలివి వచ్చింది. సిల్వరూ, మరికొందరు కళాసులూ నేనక్కడ ఉండడం గమనించకుండా ఉద్రేకంతో

మాట్లాడుకుంటున్నారు. వాళ్లంతా "వెంటనే తిరగబడి ఓడను స్వాధీనం చేసుకుందాం" అంటున్నారు. కాని, సిల్వర్ ఒప్పుకోవడంలేదు.

"మనదగ్గిర మ్యాపు లేదు. ఎక్కడుందో మనకి తెలియదు. ఈ జమీందారునీ డాక్టరునీ, నిధి ఎక్కడుందో తప్పే ఓడలోకి ఎత్తనివ్వండి. తర్వాత చూద్దాం. ఓడ సగందూరంతిరిగివెళ్ళి, మామూలుగా ఎరిగిఉన్న దారిని పడ్డాక



అప్పుడు దెబ్బతీద్దాం" అని సిల్వరు చెప్పేడు.

"మన మంతా సరంగులమే కదా! (సరంగు అంటే చుక్కాని పట్టేవాడు.) ఇంక కెప్టెన్ ఎందుకూ? అన్నాడు ఒకడు.

"మనం సరంగులం. అంతే. ఓడని నడుపుతామే కాని ఏదారిలో నడపాలో మనకి తెలియదు. నేనే గనక నైతే కనీసం వర్తకపుటోడలు తిరిగే మార్గాలవరకైనా ఓడ వెళ్లేవరకూ ఈ కెప్టెన్‌ని ముట్టుకోను. తప్పుఅంచనాలు వేసుకోవడం, నడి సముద్రంలో ఉద్ధరిణెడు ఉప్పునీళ్లతో నోరెండి చావడమూ నాకిష్టంలేదు" అన్నాడు సిల్వర్.

మనస్సులో ఎలా ఉన్నా అందరూ అతనిమాటలకి ఒప్పుకున్నారు. అతనినే తమకు నాయకుడుగా ఎన్నుకున్నారు. గొణుక్కుంటూనే తలో మూలకూ వెళ్ళిపోయారు.

వాళ్లు వెళ్లిపోయేదాకా నేను కదలకుండా కూర్చుని, తరవాత బయటపడ్డాను. సమయం చూసుకుని కుట్రవిషయం అంతా కెప్టెన్, డాక్టర్, ట్రిలానీలతో చెప్పేను.

కెప్టెన్ ఆశ్చర్యపడ్డాడు. ఏమంటే ఓడలమీద తిరుగుబాట్లు వచ్చేందుకు ముందుగా కళాసులలో పెంకెతనం, సణుగుడు, గొణుగుడు వినిపిస్తాయి. కాని ఇక్కడ అటువంటిసూచన లేవీ లేవు. నేను వార్త చెప్పడానికి కొద్దిసేపటికి ముందే దూరాన భూమి కనిపించిన ఉత్సాహంతో కళాసులందరూ సిల్వర్ నాయకత్వాన కెప్టెన్‌కి జేజేలు కొట్టేరు కూడా. అటువంటప్పుడు నామాటలు ఆశ్చర్యం కలిగించవూ?

నా మాటలు విన్నాక కెప్టెన్ తన బలాన్నీ, ఎదిరిబలాన్నీ లెక్క వేసుకున్నాడు. ఇప్పటికి మేము ఖచ్చితంగా ఏడుగురం ఉన్నాం. ఇంకా కళాసులలో తిరగబడలనేవారెందరో, తటస్థులు ఎందరో, అనుకూలు రెందరో. వారిలో తిరగబడాలనే దృష్టిలేనివారిని కనిపెట్టి, తెలుసుకుని, ఎప్పటి కప్పుడు ఆసంగతులు చెప్తూండమని నాకు పురమాయించాడు.

తరువాత ముగ్గురూ ఒక నిర్ణయానికి వచ్చారు. తిరుగుబాటు సంగతి ఎరగనట్లే ఉంటూ, ముందు జాగ్రత్తలో ఉండాలనీ, కళాసులు అనుకోనిసమయంలో ముందే దెబ్బతీయాలనీ అనుకున్నారు.

దానికి అందరూ ఒప్పుకున్నారు.

## 3

మరునాడు పొద్దున్నకి మేము పాతర్ల దీవిని సమీపించాము. అప్పటినుంచి ఇంక కళాసులలో సణుగుడూ, గొణుగుడూ, కోరచూపులూ బయలుపడ్డాయి

తిరుగుబాటు లక్షణాలు కనబడుతున్నా యని అందరికీ అర్థమయింది. సిల్వర్ మహాచురుగ్గా తిరుగుతూ కబుర్లు చెపున్నాడు. సమయం రాకుండానే తిరగబడి అంతా పాడు చేస్తారేమో నని భయంతో అతడందరినీ సర్దుబాటుచేస్తున్నా డనిపించింది. ఇంతలో దీవికి సమీపంలో ఓడ లంగరువేసింది.

ఆ సమయంలో కెప్టెన్ ఒకటి ఆలోచించాడు. నావికులలో కనిపిస్తున్న తిరుగుబాటుసూచనలు గమనించనట్లు వదిలిపెడితే వాళ్లకే అనుమానం కలుగుతుంది. అది ప్రమాదం. ఊరుకోక గట్టిగా చర్య తీసుకుంటే వెంటనే తిరగబడతారు. అదీ ప్రమాదమే. సిల్వర్ వాళ్లకి నాయకుడు. అతడికి వెంటనే తిరుగుబాటు చెయ్యకూడదనేదే ఉద్దేశం. కాని, ఓడమీద ఉండగా బాహాటంగా ఆ మాట చెప్పి, వాళ్ళకి నచ్చచెప్పడానికి వీలుండదు. వారిని దూరంగా తీసుకుపోవడానికి వీలు కలిగిస్తే, అతడు వారిని సర్దుతాడు. ఆ విధంగా సిల్వర్ నుపయోగించుకుని వెంటనే తిరుగుబాటు రాకుండా కాచుకోవాలని ఆయన ఊహించాడు. ఆ ప్రకారమే మధ్యాహ్నం అందరికీ సెలవిచ్చి, తోస్తే ఒడ్డుకి పోయి రావచ్చు నని అనుమతి నిచ్చేడు.

ట్రిలానీతో సహా మేము ఏడుగురం ఉన్నా మని చెప్పేనుకదూ? మా ఏడుగురికీ మందుకూరిన రివాల్వర్లు తలో రెండూ ఇచ్చేడు. అవసరమైన ఇతర ఏర్పాట్లు చేసేడు.

సిల్వర్ ఓడమీదికళాసులలో ఆరుగురిని ఓడమీదే వదిలిపెట్టేడు. మిగిలిన పదముగ్గురునీ దీవిమీదకు బయలుదేరదీశాడు. రెండునావలని సీటిలోకి దింపేరు. ఒకదాంట్లో సిల్వరూ మరికొందరూ ఎక్కి ముందు తోసుకుపోయారు. రెండవది బయలుదేరబోయే ముందు నాకూ ఒడ్డుకు పోవా లనిపించింది. ఓడమీద సిల్వర్ మనుష్యులు ఆరుగురికీ మావాళ్లు ఆరుగురు ఉండనే ఉన్నారు. నేను ఒడ్డుకి పోతే ఫర్వాలే దనుకున్నాను. ఎవ్వరూ చూడకుండా రెండో పడవలో నక్కేను. కొందరు కళాసులు నన్ను చూసినా వాళ్లు పట్టించుకోలేదు. కాని, ఒడ్డుకి చేరబోయే ముందు ముందుపడవలో ఉన్న సిల్వర్ నన్ను గుర్తించి, పిలిచేడు. నాకు భయం వేసింది. పడవ ఒడ్డుకి పట్టగానే సిల్వర్ పిలుస్తున్నా వినిపించుకోకుండా ఒడ్డుకి ఎక్కి, అడవిలో పడి పరుగెత్తేను.

చాలాసేపు ఆ అడవిలో తెగ తిరిగి, చివరకి ఒక కొండవాగుదగ్గరకి వచ్చేను. అడవీ, పొదలూ దట్టంగా ఉండడంచేత అంతదూరములో ఉన్నవాళ్లుకూడా కనబడడం లేదు. కాని, సమీపంలోనే మాటలు వినిపించి నిలబడ్డాను. కంఠధ్వనిని బట్టి వాళ్లల్లో ఒకడు సిల్వరే నని తెలుసుకున్నాను. రెండోవా డెవరో చప్పుడు చెయ్యకుండా పొదలచాటునే నెమ్మదిగా వారికి దగ్గరగా జరిగేను. సిల్వరు రెండోవాడితో నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తున్నాడు. రెండోవాడు సందేహిస్తున్నాడు. అదే సమయంలో కొద్దిదూరంలో ఘర్షణ, ఒకరు చావుకేకపెట్టడం వినిపించింది. ఆ ధ్వనితో సిల్వర్‌తో మాట్లాడుతున్న 'టామ్' బిగిసేడు. నిష్కారణంగా మనిషిని చంపేశా రని తిట్టి చచ్చినా సరే వారితో కలియనని చెప్పి, వెనక్కి తిరిగి విసవిసా నడిచేడు. సిల్వర్ తన చంకకఱ్ఱ తీసి, గురిచూసి టామ్‌మీదకి విసిరి కొట్టేడు. దానికొన పొడుచుకుని టామ్ వెన్ను విరిగి, నోట మాట కూడా లేకుండా కిందపడిపోయాడు. వాడిమీద ఉరికి సిల్వర్ కత్తితో పొడిచి చంపేశాడు.

టామ్‌హత్య చూసేసరికి నా ప్రాణం చచ్చిపోయింది. నన్ను చూస్తే సిల్వర్ చంపేస్తాడనే భయంతో చెట్టూపుట్టా లేకుండా అడవికి అడ్డబడి పరుగెత్తి పరుగెత్తి ఒకకొండమొదట్లోకి చేరుకున్నాను.

ఇక ఓడ ఎక్కే ఆశ లేదనిపించింది. ఇంతవరకూ కనిపించకుండా ఉండి, తీరా ఓడమీదకి అందరూ తిరిగి వెళ్లేవేళకి పడవల దగ్గర తయారయితే వాళ్లకి అనుమానం కలిగి పీక పిసిగి పారెయ్యారూ! కనక తిండిలేక చచ్చినా సరే పడవ లున్నవైపుకి తొంగి చూడకూడ దని నిశ్చయించుకున్నాను.

ఈ ఆలోచనలు సాగుతున్న సమయంలో దూరాన చప్పుడు వినబడి తలఎత్తేను. దూరాన మనిషిఆకారం గల జంతువేదో కనబడింది. దానితో నా నిర్ణయం ఎగిరిపోయింది. ఈ వింతజంతువు కన్న సిల్వర్ ముఠావాళ్ళే నయం అనిపించింది. భయంతో పడవల వైపు దౌడుతీశాను. కాని, ఆజంతువు మరీ వేగంగా అడవిని

అడ్డంతొక్కుకుని నాదారికి అడ్డం వచ్చింది. ఆ ఆకారం ఏదో జంతువుది కాదనీ, అతడూ నావంటి మనిషే నని అప్పుడు గ్రహించగలిగాను. ఇంక భయం ఏముందీ? అదీకాక పైగా నా జేబులో పిస్తోళ్లసంగతి అప్పుడే గుర్తుకు వచ్చి, ధైర్యం కలిగింది. గంభీరంగా అతడున్న వైపుకి నడిచేను.

ఆతడూ తటపటాయిస్తూ, దిక్కులు చూస్తూ, కొంతవరకు నాకు ఎదురువచ్చాడు. అంత దూరంనుంచే ఏదో కావాలన్నట్లు చేతులు జాపేడు.

"ఏం కావాలీ?"

అతనిసమాధానం వినగానే అతడు నావంటిమనిషి అవడమే కాకుండా, నాదేశపు మనిషే నని కూడా గ్రహించేను.

ఇద్దరం చాలాసేపు మాట్లాడుకున్నాం.

అతడిపేరు 'బెంజమిన్ గన్' కెప్టెన్ ఫ్లింట్ ఓడదొంగల ముఠాలోనివాడే అతడూ. సిల్వరూ, బిల్ కూడా అందులోనివారే నట. ఫ్లింట్ తననిధిని ఆదీవిమీద పాతిపెట్టినప్పుడు గన్ కూడా ఆఓడలోనే ఉన్నాడట. ఆ నిధిని తీసుకుని ఆరుగురుదొంగలతో ఫ్లింట్ దీవిమీదకు వెళ్ళేడట. ఒక వారం రోజులు పోయాక అతడొక్కడే తిరిగి వచ్చాడు. ఆ ఆరుగురునీ అతడెలాగో ఎక్కడో చంపేశాడట. ఓడలోని వాళ్లొక్కళ్ళూ కూడా మాట్లాడలేదట. ఫ్లింట్ అంటే అందరికీ అంతభయం. తర్వాత ఆ ముఠా అంతా చెల్లాచెదరయిపోయింది. గన్ ఒక ఓడలో పనికి కుదిరేడు. అది జరిగిన రెండుమూడేళ్లకి అతడున్న ఓడ ఆదీవికి దగ్గరగా వచ్చినప్పుడు గన్ మిగిలిన కళాసులందరికి ఫ్లింట్ పాతివేసిన నిధి మాట చెప్పేడు. వారంతా ఓడను నిలిపి ఒక వారం రోజులు దీవిఅంతా తెగవెతికారు. కాని, ఏమీ దొరకలేదు. గన్ అబద్ధం చెప్పేడని వారికి కోపం వచ్చి, ఒక తుపాకీ, ఇంత మందుగుండూ అతని కిచ్చి, దీవిలో వదిలిపెట్టి, ఓడను తోసుకుపోయారట. ఇది జరిగి అప్పుడే మూడేళ్లయింది.

ఈ మూడేళ్లలోనూ తాను చేసినపనులన్నీ బెంజమిన్ ఏకరువు పెట్టేడు. చిన్నదోనెను తయారు చేసుకుని ఒకచోట దాచేనన్నాడు. దీవిఅంతా వెతికి నిధి ఉన్నచోటు పట్టుకుని, తవ్వి దానిని మరోచోట చేర్చుకున్నా నన్నాడు. తనను ఇంగ్లండు తీసుకుపోయి, ఒక వెయ్యి పౌను లిచ్చేటట్లయితే నిధి నంతనూ వప్పచెప్తాననీ, ట్రిలానీతో చెప్పి తనను దేశం చేర్చేటందుకు సిఫారసు చేయమనీ బ్రతిమాలేడు. నేను సరే నని ధైర్యం చెప్పేను.

ఈ విధంగా ఇద్దరం మాట్లాడుకుంటున్న సమయంలో కొంచెం దూరంలో తుపాకుల చప్పుడు వినబడింది. ఏమిటో తెలుసుకొనేటందుకు ఆధ్వనివచ్చినవైపు పరుగుత్తాం. కొద్దిదూరం పోయేసరికి అడవిలో ఒకచెట్టుమీద యూనియన్ జాక్ ఎగురుతూ కనబడింది.

"కొయ్యకోటమీద ఉంది ఆ జెండా. దానినిపట్టి మీ వాళ్లే అక్కడ ఉన్నారని అనుకుంటాను" అన్నాడు గన్.

కొయ్యకోటఒకటి ఆ అడవిలో ఉన్నట్లు మ్యాపులో గుర్తించబడిన విషయం జ్ఞాపకం వచ్చింది.

"సిల్వర్ ముఠా అక్కడుంటే



లండన్‌లో జరిగిన అగ్రరాజ్యత్రయ విదేశాంగమంత్రుల సమావేశం. అఛిసన్, బెవిన్, షూమన్లు సంప్రదించుకుంటున్న దృశ్యం.

బాలానందం

# అలెగ్జాండరు-కోయదొర

శ్రీమతి పెనుమాక అన్నపూర్ణ

ప్రపంచాన్ని జయించాలని గ్రీసు దేశపు రాజైన అలెగ్జాండర్ పెద్ద సైన్యంతో బయల్దేరాడు. ఆఫ్రికా ఖండంలో వో మారుమూలగా స్వేచ్ఛాప్రశాంతాలతో విరాజిల్లుతూ చిన్న చిన్న గుడిసెలలో వుండే కొండజాతి కోయవాళ్ల గ్రామంగుండా వెళ్లవలసివచ్చింది. కొందరు కోయలు అలెగ్జాండరుని సగౌరవంగా ఆహ్వానించి ఆతనిని వాండ్ల నాయకునివద్దకు తీసికొని పోయిరి.

కోయల నాయకుడు బంగారపు ఖర్జూరపు పండ్లు, బంగారపు అత్తి పండ్లు, బంగారపు రొట్టెను అలెగ్జాండరుముందు బహుమతిగా పెట్టెను. అలెగ్జాండరు విస్మితుడై—

"మీ దేశంలో బంగారం తింటారా ఏమి? అని ప్రశ్నించాడు.

"అవును" అని అంటూ "మా దేశపు బంగారం మిమ్మల్ని ఆకర్షించి యిలా రప్పించిందా" అని ఎదురుప్రశ్నించాడు.

"కాదు కాదు మీతో వుండి, మీ ఆచారవ్యవహారాలను తెలుసుకోవాలని వచ్చాను" అన్నాడు అలెగ్జాండరు.

"సంతోషము" అని కోయ నాయకుడు జవాబిచ్చాడు.

యింతలో యిరువురు మనుష్యులు ఆహాలులోనికి తీర్పుకోసం వచ్చారు. అందులో మొదటివాడు "ప్రభూ! నేనాతనివద్ద కొంత భూమిని కొన్నా. అందులో ఒక కాలువ త్రవ్విస్తుంటే కొంత నిధి దొరికింది. నా అంతరాత్మ అది నా సొమ్ము కాదని బోధించింది. వెంటనే ఆ సొమ్ము ఆయనకు అందజేసాను. అతడు తిరిగి దానిని నాకే పంపాడు. ఎన్నిసారులు తీసుకో మన్నా తీసికోడు. ఏం చేసేది ప్రభూ!" అని చెప్పాడు.

రెండవవాడు "దొరా! భూమితో పాటు అందలి నిధినిక్షేపాలను కూడ అతనికే అమ్మేశాను. ఒకసారి అమ్మినతరువాత - అందలి నిధులు నాకెంతమాత్రం చెందవు. పైగా న్యాయవిరుద్ధం. దొరవారు ఆనిధిని ఏం చెయ్యాలో తీర్పివ్వండి తీర్పు ప్రకారం నడుచుకొంటాం" అన్నాడు.

అలెగ్జాండర్ ఆదుర్దాతో వింటున్నాడు ఏమని తీర్పిస్తాడో నని. ప్రశాంతంగా వారిద్దరి మాటలు విన్నాడు కోయనాయకుడు. రెండే క్షణాలు ఆలోచించాడు. ఏదో మెరపు మెరిసింది బుఱ్ఱలో. మందహాసంతో మొదటివానితో "నీకు కుమారు డున్నాడా?"

"అవును ప్రభూ"

రెండవవానితో, "నీకు కుమార్తె వుందా?"

"చిత్తం. వుంది దొరా"

"అయితే వారిద్దరికి వివాహం జరిపి ఆధనాన్ని వాండ్ల పెండ్లి కట్నంక్రింద యివ్వండి" అని తీర్పు చెప్పాడు.

అలెగ్జాండరు ఆశ్చర్యంతో చూస్తున్నాడు.

"యిలాంటివి. విషయాలు మీ దేశంలో ఎలా తీర్పిస్తారండీ?" అని నాయకుడు అలెగ్జాండర్ని అడిగాడు.

"ప్రథమంలో ఆ యిద్దరు వ్యక్తుల్ని అరెస్టు చేస్తాము. ఆ తర్వాత ఆ ఆస్తిఅంతా రాజు స్వాధీన మవుతుంది" అన్నాడు అలెగ్జాండరు.

నాయకుడు విస్మయంతో—

"అయితే మీ దేశంలో వర్షం కురుస్తుందా?"

"కురవకేం? బాగానే కురుస్తుంది"

"గడ్డి బాగా పెరుగుతుందా?"

"బాగా ఏపుగా"

"మరి జంతువు లేమయినా వున్నవా మీ దేశంలో?"

"లేకేం, అన్నిరకాల జంతువులు అనేకం వున్నై"

"ఓ. అందుకోసమా, అలా ప్రశాంతంగా జీవించే అ సాధువులైన జంతువులకొరకే మీ దేశంలో వర్షం కుర్సేది, గడ్డి పెరిగేది— మీకోసం కాదు."

---

వాళ్లు యూనియన్ జాక్‌ని ఎత్తరు. కనుక నిర్భయంగా వెళ్లి, నా సంగతి మాట్లాడు" అని బెంజమిన్ గన్ నన్ను పంపించాడు. ఆ రోజున కలుసుకున్న చోటునే కలుసుకోడానికి నిశ్చయించుకొని ఇద్దరం విడిపోయాం. నేను కొయ్య కోట వెపు వెళ్లేను.

# హాలుని గాథాసప్తశతి

(16-వ పేజీ తరువాయి)

కాలములో ఉద్భవించినది కాబట్టి, గాథాసప్తశతీనిర్మాణకాలము, దగ్గరదగ్గర రెండువేలసంవత్సరాలకు అందుకొంటున్నది. పెక్కు సభ్యజాతుల ప్రబలమైన సమాజములో, ఏ ఒక సభ్యతాశ్రీ కూడా అడుగిడని ఆ కాలములోగూడా, భారతదేశములో అపూర్వమైన ఇట్టి ధ్వనికావ్యము నిర్మింపబడినది; సభ్యత, సంపూర్ణవికాసమును పొందినపిదపకూడా, ఈ కావ్యమునకు ప్రాతిద్వంద్వము నభూతో న భవిష్యతిఅయినది! అని అంటే, ఈకావ్యముయొక్క ఉత్తమోత్తమత, స్వయముగా ప్రకటమవుతున్నది.

అంతేగాక - ఈ మహాకావ్యము, సాహిత్యశాస్త్రములో పరిభాషింపబడిన సర్వలక్షణములతోను సులక్షితమై ఒప్పుచున్నది. సహృదయానందకరముగా, రసికజనమనోహరముగా, పసుపడి, వైశిష్ట్యమును పొందేలాగు, ఈ కావ్యములో, అలంకారములు, మంజులపదగుంఫముతో, సహజసుందరమైన కావ్యస్వరూపము శోభావంతమై విలసిల్లునటు, సుసంజితములై ఉన్నవి. 'కావ్యాత్మ' అని పొగడబడు రససామ్రాజ్య మీ కావ్యముతో ముఖ్యముగా నలయింపబడినది. చమత్కారమైన యత్కించిత్ వ్యంగ్యమేని కాకుండా, ఏ పద్యముకూడా, ఈ కోశములో సంగ్రహింపబడలేదని ప్రతిజ్ఞాపూర్వకముగా ఉద్ఘోషించుటకు ఈ కావ్యము, సుసమర్థమై ఒప్పుతున్నది. ఇందులో, శృంగారరసము అంగి. అది, అంతటా, అవ్యాహతముగా విలసిల్లుతున్నది. ప్రసాదమాధుర్యాదిగుణములు అడుగడుగునా ఉజ్జ్వలములవుతున్నవి, అని వేరే చెప్పనక్కరలేదు. సరసములైన కావ్యములలో వాని ప్రవేశము అవశ్యము ఉండి తీరుతుందిగదా!

వేయేల? సకలశాస్త్రసారములు, శ్లోకార్థములో విదితమైనట్లు, గాథాసప్తశతీమహాకావ్యవైశిష్ట్యమును తెలిసికొనుటకు ఈ ఒక్క మాట చాలును. ఏమన-

"గాథాసప్తశతిని అనుసరించియే అన్ని లక్షణశాస్త్రములు ఘటిల్లినవి."

# పనికిరాని పరోపకారి

(14-వ పేజీ తరువాయి)

"సన్నయ్య గాదు, పెద్దయ్య. అచ్చం కొద్దమ్మ అన్నగారే!"

"రాబందు కదిలిందిరోయ్!"

"ఎలా ఉంటే వీడి కేంపాకు! శకునపక్షి-శకునపక్షి-అడిగా డంటే చాలు!"

ఈ సరసను జల్లుగా మొదలై చివికి చివికి గాలివానకింద మారింది చివరకు సన్నయ్యపంతులుగారిమీద అపవాదు. ఆయన మామూలుగా ఊరికే ఎవరింటికి వెళ్లినా ఆ ఇంట్లో ఎవరికో జబ్బు చేస్తుంది, ఒకవేళ తగ్గినా చచ్చినంత పని అవుతుంది అన్న నమ్మకం స్థిరపడింది.

కొన్నాళ్ల పాటు దేమీ ఆయనకు తెలియ రాలేదు గాని చివరకు నెమ్మదిగా పరిస్థితి చాలావరకు బోధపడింది, కొంతమంది తన ఎదురుగానే, తనతో గాకపోయినా పక్క వాళ్లతో అనే మాటలు వినడాన్ని.

మనస్సులో చాలా ఖేదం డారు "ఇలాంటి దేమి చెప్మా లోకం!" అని. అప్పటినుండి పిలుపు వస్తేనే కాని ఎవరింటికీ వెళ్లడం మానేసా రాయన. పిలుపు వచ్చినప్పుడు ఎలాంటి పనైనా తప్పక వెళ్లడంమటుకు మాన లేదు. కొన్నాళ్లవరకూ ఆయన్ని పిలిచేవారు తప్పనిసరై చాలమంది. కాని ఆమధ్య వచ్చిన కలరాలో జిల్లో విశ్వేశ్వర్రావు గారింట్లో ఆయనతల్లి పోయినప్పటినుంచి ఆయంత్రమే భాగ్యకూడా పరమపదించడానికి మధ్యాహ్నం... వాహకత్వానికి వచ్చిన సన్నయ్యపంతులుగారే కారకు డన్నమాటా ఊళ్లో పాకిపోయినదగ్గరనుండీ ఆయన్ని మరెవరూ పిలవడమే మానేసారు, మరో విధంగా ఎంతకష్టమైనా.

సన్నయ్యపంతులుగారు కాలుపెట్టిన నాటినుంచీ నెలనాటీమరణాల సగటుసంఖ్య ఆ ఊళ్లో హెచ్చయిందన్న అసత్యపు కబురొకటి యూనియన్ బోర్డు ఆఫీసులో పని చేస్తున్న ఇద్దరు ప్రబుద్ధుల మేదస్సులు సృష్టించి గాలిలో వదిలాయి ఒకనాటి మధ్యాహ్నం. అంతకుముందు జననమరణాలు రిజిష్టర్ చెయ్యాలన్న సంగతే తెలియకుండా, తెలిసినా మరిచిపోతూ, ఉండే వాళ్లమే, సన్నయ్యపంతులుగారు వచ్చిం దగ్గరనుండీ మాత్రమే నా బొందో అని ఆయన పడే తాపత్రయంద్వారా ప్రతీజననమూ మరణమూ యూనియన్ రిజిష్టర్లలో కెక్కిందనీ అన్న నగ్నసత్యాన్ని ఆ ఊళ్లో ఎవ్వరూ తలపుకు తెచ్చుకోక ఆ పుకారుకు చిలవలూ పలవలూ కల్పించి ప్రచారమివ్వడం మొదలుపెట్టారు.

రోజురోజుకు అఫీసుకు ఊరి పెద్దలు సైసుమాష్టరుగారిమీద వచ్చే పంతకం ఉన్న, లేని, అనేకరకాల రిపోర్టుల బాధ పడలేని డిస్ట్రిక్టుబోర్డు మరో ఊరికి బదిలీ చేసింది, ఆ ఊరికి పనికిరాని పరోపకారి సన్నయ్యపంతులుగారిని.



ఇండోనీషియా రిపబ్లిక్ అవతరణోత్సవం నాడు. ప్రధాని నెహ్రూ ఇండోనీషియా రాయబారి డాక్టర్ సుదర్శనోగారిని అభినందించిన దృశ్యం.

# బట్టతలలు

(12-వ పేజీ తరువాయి)

వెళ్ళా. క్రమేణా నారాయణరావుగారు రావటం తగ్గించారు. ఓ పదిహేనురోజులైం తరువాత అసలు రావటమే మానేశారు. కాని నేను పోవటానికి సాహసించలేదు. పని గంటలూ ఏమంత ఎక్కువ లేవు. పనా అసలే లేదు. వృథాగా ఆఫీసులోంచి పోయి 500 పోగొట్టుకోవటం దేని కనుకున్నా. నెల గడిచింది. నారాయణరావుగారు ఓనాడు వచ్చి నాపనికి ప్రశంసించి 500 ఇచ్చేప్పటికి నేను ఈలోకంలో ఉన్నానా లేక ఇంకెడెన్నా గ్రహంలో ఉన్నానా అని అనుమానం వేసింది. ఈలా ఇంకో మూడు వారాలు గడిచాయి. ఓరోజు జ్వరం వచ్చి పడి. కాని ఆఫీసు కెళ్ళా. పనిచేస్తుంటే "వద్దు కూచోండి ఊరకనే" అని నారాయణరావు దగ్గర కూచోని నాకు ల్లగా కబుర్లు చెప్పి పంపాడు. ఆయనగుణుకు ఆశ్చర్యపోయా. ఈలా గడిచింది. నిన్న ఆఫీసు కెళ్ళా. అక్కడ బోర్డు చూచేప్పటికి నా గుండే ఆగిపోయేంత పని జరిగింది. బోర్డులో ఈలా వ్రాసివుంది. "మందుల షాపు - ఆయుర్వేదఆలయం"అని. వెంటనే చుట్టుప్రక్కల కలయజూచా. ఎక్కడ మా ఆఫీసు బోర్డు లేదు. ఇంటిదారుడిదగ్గరికెళ్ళి సంఘాన్ని గూర్చి ప్రశ్నించా. "అదేమండీ ఆలా వింతమృగంలా మాట్లాడుతారు. ఆలాంటి సంఘం లేదే!" అన్నాడు చదువుకుంటున్నవాడల్లా అద్దాలు పైకి తోసి చూస్తూ. ఆయన్ని తందామన్నంత కోపం వచ్చి తన్నబోయి తన్నేంతపని చేసి ఆగి, "అయితే నారాయణరావుగారేరీ?"అన్నా శాంతంగా. ఓ చిన్ననవ్వు నవ్వాడు తనకు మూడేమూడు దంతాలున్నాయని చూపించటానికి. ఆ మూడు రాలగొడదామనుకున్నా "నారాయణరావెవడు? ఇక్కడెవ్వడూ ఆలాంటివాడు లేడే! ఆయింట్లో ఓదూది వ్యాపారస్థుండేవాడు. ఆయనపేరు లక్ష్మీపతి బట్టతలాయన. నిన్ననే ఖాళీచేస్తే మందులషాపు కిచ్చా" అన్నాడు. "అయితే లక్ష్మీపతిగారి క్రొత్తఅడ్రసు ఏమిటి?" అన్నా ఇంటాయన్ని క్రిందినుంచి పైకి జాగ్రత్తగా చూస్తూ. "ఇదో అడ్రసు."అని అడ్రసిచ్చాడు. ఆ అడ్రసుకు నడిచివెళ్ళా నిన్న సాయంత్రం. అక్కడ పోయి చూస్తే "బాటా చెప్పులు, బూట్లు దొరుకుతాయి ఇక్కడ" అని ఉంది బోర్డు. ఈసారి భయమేసింది. ఇదేదో పెద్దప్లాటు అనుకొని ఇల్లు చేరుకున్నా. ఆనంద్‌ను పిల్చి చెప్పాశా జరిగిందంతా. "ఆలా గాభరా పడతా రెందుకు? రేపో మాపో కార్డు వ్రాస్తారేమో అని సర్దాడు. అయినా అనుమానం తీరలేదు నాకు. అందుకని మీదగ్గరి కొచ్చా" అని ముగించాడు సుబ్బారావు. నాకు తలక్రిందులైనట్టనిపించింది ప్రపంచం. "ఆనంద్ మీదగ్గరనే ఉన్నాడా ఇప్పుడు?" అని ప్రశ్నించాడు నామిత్రుడు సిగరెట్టు ముట్టిస్తూ. "ఊఁ" అని తలూపాడు సుబ్బారావు. "కాసేపుండి అయితే మీ ఆనంద్‌కు ఎడంచెంపమీద ఓ చిన్న కత్తిగాయం ఉండనుకుంటా" అన్నాడు వరదారావు. "అవునండీ మీ కేలా తెలుసు" అన్నాడు పెద్దమనిషి ఆలోచిస్తూ. "ఇంకా ఆయనకు కుడిచెవ్వు తెగిపోయి ఉంగికదూ" అన్నాడు మళ్ళీ డిటెక్టివ్. "అవునండి చిన్నప్పుడు దొంగ లెత్తుకుపోయి చెవ్వుపోగు రాకుంటే తెంపేసి పొడిచి పోయారుట." అన్నాడు ఆశ్చర్యంతో పెద్దమనిషి. "ఈ వేళ శనివారం. సోమవారం రాండి, మీ కథను ఆలోచిస్తా అన్నాడు వరదారావు. "వెధవ ఉద్యోగం పోయిందని కాదండి నేను తొక్కట్లాడేది ఈసంఘం ఏమిటో తెల్సుకోవాలి" అంటూ లేచిపోయాడు 'నమస్తే' అని పెద్దమనిషి. "ఏమోయ్ జయరాం! ఏమన్నా దొరికిందా సొల్యూషన్" అన్నాడు. నామిత్రుడు "నాకేం బోధపడటంలేదు"అన్నా నేను. ఓ ముప్పావుగంట కళ్ళుమూసుకొని ఈజీచేర్‌లో పడుకున్నాడు వరదడు. నిద్రపోయాడేమో అనుకొని నేను పరిశోధన ఆరంభించా నా మెదడులో. ఎన్నిసార్లు ఆలోచించినా బట్టతలలే కనపడతాయికాని ఇంకేం అగుపించవు. ఇంతలో "దొరికిందిరా బ్రదర్" అంటూ ఛంగున ఎగిరి నిలబడ్డాడు ఈజీచేర్ పైన నామిత్రుడు హఠాత్తుగా. నాకు ఆశ్చర్యం వేసింది. పిచ్చాసుపత్రికి పోవాల్సిన అగత్యం రాదుకదా అని అనుమానించా. "ఏమోయ్ బ్రదర్! అలా వెర్రిచూపులు చూస్తా వెందుకు?" అని నామిత్రుడు నా భుజంమీద తట్టి, "ఈవేళ వెల్‌కం టాకీసు దగ్గర స్వర్ణలతాడాన్సు కదూ. పోదాం రావోయ్ నీప్రాక్టీసు పోదుకద "అన్నాడు. "ఏడిచినట్టే ఉంది ప్రాక్టీసు. అందులో నాలాంటిడాక్టరుదగ్గరి కెవ రొస్తారు అర్ధరాత్రి. తప్పక పోదాం" అన్నా. సాయంత్రం ఏడుకు భోంచేసి ఇద్దరం వెల్‌కం టాకీసు చేరుకున్నాం. టాక్సీలో పోయినంతసేపు వరదుడు కూనిరాగాలు తీస్తున్నాడు. నా కాశ్చర్యం వేసింది నాబోటివాడు డిటెక్షన్ చేస్తుంటే ఈపాటికేలా ఉండేవాణ్ణి కేసు వినగానే పొద్దస్తమానం తెగ ఆలోచించనూ? ఈమనిషికి అసలు కేసు సంగతి పట్టినట్టే లేదే! ఇంతా ఆలోచించి డ్యాన్సుకు పోదామంటాడే! ఇంకే మనుకో లి...టాక్సీ క్యాషాబ్యాంకు దగ్గర నిల్చింది వెల్‌కం థియేటర్ దగ్గర కాదు! ఇద్దరం దిగాం - టాక్సీ పోయింది. వరదడు అన్ని ఇండ్లు చూశాడు చుట్టుప్రక్కల. 27 ఇల్లు కనిపించింది బ్యాంకుకు అనుకొని దానికి "కమ్మరిదుకాణం, సుబ్బారావు"అని వ్రాసివుంది. ఇద్దరం అక్కడికెళ్ళాం. కర్రతో వరదడు నేలపైన ఆరేడు సార్లు కొట్టి, "సుబ్బారావ్" అని పిల్చాడు. గబుక్కున తలుపు తెరుచుకొని ఓ యువకుడు వచ్చాడు. ఇతనే ఆనంద్ అయివుంటాడు అనుకున్నా నేను. "సుబ్బారావుగారు లేరు. ఏం కావాలి"అన్నాడు ఆనంద్. "వెల్‌కంటాకీసు కెట్లా పోవాలి" అన్నా నేను. "డబ్బుంటే కారులో ఎక్కి; లేకుంటే నడిచి" అని గబుక్కున తలుపు మూశాడు. తెల్లబోయి వరదడి ప్రక్క చూచా నవ్వుకుంటున్నాడేమోనని. ఇద్దరం వీధికొన కొచ్చాం. వరదడు భుజంమీద చెయ్యివేశి, "జయరామ్! ఇప్పుడు 7-30 అయింది. 10 గంటలకల్లా మాయింటికి రా! వచ్చేప్పుడు రివాల్వరుకూడా తీసుకురా"అన్నాడు. "సరే!"అని వెళ్ళిపోయా నేను. 10 కల్లా వరదడి ఇంటి కెళ్ళా. తలుపు వేసిఉంది. తలుపు తట్టగానే తెరుచుకుంది. లోపలి కెళ్ళి తలుపు వేశా. లోపల వీరవడితో ఇంకా ఇద్దరు మాట్లాడుతున్నారు. ఇద్దరు పంచలు కట్టి లాల్చీలు తొడుక్కొని ఉన్నారు. నన్ను ఇద్దరికి పరిచయం చేశాడు మావాడు. ఇద్దర్లో ఒకాయన నల్లగా ఇంచుమించు 6 అడుగుల ఎత్తు, ఎత్తుకు తగ్గ లావు

గలమనిషి. "ఈయన శ్రీపోలీస్ ఇన్స్పెక్టర్ జగదీశ్" అన్నాడు మామిత్రుడు. ఇన్స్పెక్టర్‌గారికి నమస్కరించా. "వీరు శ్రీ రామనాథం గారు. కృష్ణాబ్యాంకు మేనేజరుగారు" అన్నాడు ఇంకో సన్నటి మనిషిని చూపించి. వారికి వందనం చేశా. "పది కావస్తూంది పోదాం" అని లేచాడు వరదారావు. అంతా బయలుదేరి వీధిమలుపులో కొచ్చి కారుదిగి బ్యాంకుకు నిశ్శబ్దంగా వచ్చాం. రామనాథంగారు తలుపు తీశారు. అంతా లోపలి కెళ్ళాం. మళ్లీ తలుపువేశి లోపలప్రక్క తాళం వేశారు. బ్యాంకు చుట్టూ ఇళ్లు ఉన్నాయి. అన్నీ ఇంతలో వరదారావు రామనాథంతో ఏదో చెప్పి ఓగదిలోకి తీసుకెళ్లాడు. దానినిండా బంగారు బస్తాలతో నిండివుంది. వరదారావు తన టార్చిలైటు, భూతద్దం తీసి నేలపరీక్షించాడు. కాసేపు చూచి లైటు ఆర్పేసి. "చెప్పినట్లు చేశారు కదూ" అన్నాడు జగదీశ్ ప్రక్క తిరిగి మావాడు. "ఆఁ బయట ఓ సబ్ ఇన్స్పెక్టర్ ఇద్దరు పోలీసులున్నారు" అన్నాడు జగదీశ్. నావైపు తిరిగి వరదడు, "మనమీద కెవ్వరైనా తుపాకి పేల్చటానికి ప్రయత్నిస్తే వెంటనే ఆలోచించకుండా కాల్చేయ్" అన్నాడు. "సరే!" అన్నా భయపడుతూ. 10-30 అయింది. అంతా నిశ్శబ్దం. మనుషుల శ్వాస పీల్చటం వదిలటం తప్పితే ఏమీ శబ్దం లేదు. వెలుతురులేదు. అసలెవ్వరొస్తారని వరదడి ఆర్భాటం? 10-40 కాగానే ఎక్కడినుంచో వెలుగొచ్చింది రూమ్‌లోకి. వరదడు చెయ్యి ఊపేప్పటికంతా చాటున దాముకున్నాం. వెల్తురెక్కడినుంచి వస్తున్నదా అని చూచా. క్రిందినుంచి భూమిలోంచి నేలకు పగుల్లుండటం కనిపించింది నాకు అప్పుడు. ఇంతలో ఓ శబ్దం. అమాంతంగా ఒక రాయి పైకిలేచి క్రిందికి పోయింది. ఓ నల్లటిమనిషి చేయి పైకి పెట్టి నాలుగుప్రక్కల కలయచూచాడు. మళ్లీ లోపలి కెళ్లాడు. ఎంతోసేపు లేదు. మళ్లీ వచ్చి మెల్లగా చేతులు కన్నంలో ఉంచి మెల్లగా శరీరాన్ని పైకి లాక్కున్నాడు. "ఉలి, సంచులు తెచ్చావ్ కదూ" అన్నాడు నెమ్మదిగా రెండోవాణ్ణి పైకి లాక్కుంటూ. ఓ అరక్షణం అయిందో లేదో వరదడు టార్చిఫోకసు చేయటం, నేను రివాల్వారు తీయటం, సింహంలా జగదీశ్ మొదటివాణ్ణి పట్టుకోవటం, రెండోవాడు జారిపోవటం అన్నీ జరిగాయి. "జాగ్రత్త! వదిలిపెట్టు మర్యాదగా. నా రక్తనాళాల్లో జమీందారీ నెత్తురుంది. గొప్పవంశస్థుణ్ణి. అయ్యో! అని మాట్లాడు" అన్నాడు మొదటిదొంగ. "నోరు ముయ్! వెధవాయ్" అని ఓ చెంపమీద ఫెళ్లున తగిలించాడు ఇన్స్పెక్టర్. వెంటనే చేతికి సంకెళ్లు వేశేశాడు. "నడు గాడిద నడు" అని ఓ తన్ను తన్నాడు బూటుకాలితో వీపుమీద జగదీశ్. అంతా బయటికొచ్చాం. రామనాథంగారు తాళాం వేశారు. బయటికి రాగానే ఇద్దరు పోలీసులు, వారిమధ్య రెండోదొంగ, ఓ సబ్ఇన్స్పెక్టర్ కనుపించారు. వరదడు విజిల్ వేస్తూనే ఓటాక్సీ వచ్చింది. అంతా అందులో ఎక్కి పోలీసు స్టేషను కెళ్లి దొంగల్ని కొట్లులోకి చేర్చాము. అప్పుడు తెలిసింది నాకు వాళ్లలో మొదటివాడు లక్ష్మీపతి నారాయణరావు అని పేర్లుపెట్టుకున్నవాడని, రెండోవాడు ఆనంద్ అనిన్నీ.

రెండోరోజు పదిగంటలకు వరదారావు ఇంటి కెళ్లా. ఇంట్లో జగదీశ్ రామనాథం మాట్లాడుతున్నారు. "రండి డాక్టర్ గారూ!" అని అహ్వానించారు. అంతా వరదారావు తెలివికీ, జగదీశ్ శౌర్యానికీ పొగిడాము. "మా బ్యాంకును రక్షించి మమ్మల్ని రక్షించారు." అంటూ రామనాథం ఓ 5 వందరూపాయిల నోట్లు వరదారావు జేబులో వేసి శలవు పుచ్చుకున్నాడు. జగదీశ్ అయన్ను పొగిడి 'నమస్తే' చెప్పి వెళ్లాడు "ఏమండీ డాక్టర్‌జీ!" అన్నాడు వరదారావు నాప్రక్క తిరిగి. "నీ తెలివి అద్భుతమోయ్! అయినా నీవు చూచిందే నేనూ చూచా, నీవు విన్నదే నేనూ విన్నా, నాకు ఇంత ఆలోచన రాలేదే! అసలు ఇదేమిటంతా అయోమయంగా ఉంది. కాస్త చెప్పవోయ్" అన్నా "మనం మొదట పట్టుకున్న దొంగపేరు కామేశ్వరరావు అనేవాడు. అతను గ్రాడుయేట్. వాళ్ల తాత ముత్తాతల్నించి ఉన్న జమీందారీ వెలిగించి ఉద్యోగం చెయ్యక దొంగతనాలకు మళ్లాడు. ఆనంద్ అతని ముఠాలోవాడు. ఈబట్టతలల సంఘం ఆ కామేశ్వరరావు ప్లాను. ఇది బ్యాంకులో దొంగతనం చేద్దామని ప్లాటు. దొంగతనం చెయ్యటానికి తలుపులు పగులగొట్టటం అసాధ్యం. ఇంక కన్నం వెయ్యాలి. అందుకని ఆ బ్యాంకుపక్కన ఉన్న ఇంట్లో చేరి అక్కణ్ణించి ఆరంభించాలి. బంగారు నిల్వవుండే గది సుబ్బారావుఇంటిప్రక్కదే. అందు కక్కడ చేరాడు ఆనంద్. అతను రోజూ కెమెరాసాకు పెట్టి లోపలి కెళ్లేది కన్నం త్రవ్వటానికే. ఈ సంఘం పెట్టి అందులో ఎవ్వర్ని తీసుకోక సుబ్బారావును తీసుకోవటం అతన్ని రోజూ 3 గంటలు ఇంట్లో లేకుండా చేసి పనిసాగించటానికి. ఆగంటల్లో ఆఫీసులోంచి అడుగు బయట పెట్టకూడదని కట్టుదిట్టం చేశారు అతన్ని. నేను కర్రతో ఆరుసార్లు కొట్టగానే బోలు శబ్దం వచ్చింది. ఆ దేకన్నానికి త్రోవ. నేను పిల్చింది ఆనంద్‌ను చూస్తామని. సుబ్బారావు ఇంట్లో లేడని తెలుసు. ఇంక ఆనంద్ జవాబు ఇవ్వక తప్పదు. ఇంట్లో ఇంకెవ్వరు లేకపోయిరి మరి. ఆనంద్‌ను నీవు గమనించలా సరిగా. అతను రాగానే పంచ ఎగచెక్కి ఉన్నాడు. మోకాళ్ళు మట్టితో ఉన్నాయి. అంటే అతను త్రవ్వుతున్నాడన్నమాట. అసలు నిన్నరాత్రి ఎందుకు చేస్తారని అనుమానం వచ్చిందంటావేమో. నిన్న శనివారం, ఈ వేళ ఆదివారం. ఈవేళ బ్యాంకు ఉండదు. కనక దొంగతనం సోమవారం ప్రొద్దున10 గంటలకు బ్యాంకు తెరిచినప్పుడే బయటపడుతుంది. కాబట్టి వాళ్లకు చాల టైము ఉంటుంది." అని ముగించాడు వరదారావు సిగరెట్టు పీలుస్తూ. అతని తెలివికి ఆశ్చర్యపోయా. "ఈవేళ వసంతాటాకీసు లో ఫిల్ము ఏముటోయ్" అన్నాడు మళ్లీ. చంద్రహారం అన్నా. ఆవేళ సాయంత్రం వరదడు సతీసమేతంగా మాయింటి కొచ్చాడు. నేనూ మా ఆవిడను తీసుకొని షోకి వెళ్లాం అందరం.

---

# వనమహోత్సవం



[ఎస్సార్]

ఇంటి ముంగిళ్లనుంచి అరటిమొక్కలు పారిపోయి ఊరికవతల తోటల్లో చేరినప్పుడే మన పచ్చదనం మాడిపోయిందిట. పారిపోయి వర్తకులికీ, కూలీలకేగాని నరుల కంటబడనని చెప్పి దాక్కుంది—వర్తకులికి ధనం కాయడానికీ. కూలీల వెన్ను విరగ్గొట్టడానికీ, దాంతో భాగ్యవంతుల ఇళ్లలో క్రోటన్సు మొక్కలు నల్లదొరసానుల్లాగా తయారైనాయి. "రోడ్లప్రక్కల వృక్షములు వేయించెను. సత్రములు కట్టించెను" అని అశోక, శ్రీ హర్షాది చక్రవర్తులకు లభించిన స్తోత్రపాఠాలు బ్రిటిష్ పాలకులకు అందలేదు. వీరొచ్చి మనచేత క్రొత్త పాఠాలు చదివించారు. "రైలుమార్గములు వేసిరి. అరణ్యములు కొట్టించిరి. తంతితపాలా సౌకర్యము లిచ్చిరి"—అని.

మళ్లీ మన పూర్వ వైభవాన్నీ, దానితోపాటు పూర్వస్తోత్రపాఠాల్నీ, పునరుద్ధరించుకోవాలని నెహ్రూ, మున్షీ ప్రభృతుల ఆశయం. నెహ్రూగారు అశోకుని ధర్మచక్రాన్నీ, నవ్వేమూడుసింహాల్నీ ఉద్ధరించారు. మున్షీగారు వృక్షసంపదని ఉద్ధరించడానికి కంకణం(తోరణం) కట్టుకున్నారు. ఎక్కడ ఎడంఉంటే అక్కడ జూలై మొదటి వారంలో మొక్కలు పాతాలని దేశాని కాదేశ మిచ్చారు. ఈదెబ్బతో నర్సరీలకి గిరాకీ అందుకుంటుంది. ఇంటింటా ఊరూరా ప్రతికాలువ ఒడ్డునా, ప్రతికచేరీ ఆవరణలోనూ ప్రతికాలువ, నది, ఏరు, పిల్లకాలువ, పంటకాలువ, మురుగుకాలువ ఒడ్డునా (బహుశా నూతులవద్ద గోతులవద్ద కూడా) మొక్కలు పాతాలి.

1947 ఆగస్టు 15 వ తేదీని స్వాతంత్ర్య ప్రాప్తి స్మృతిచిహ్నంగా దేశమంతటా నాయకులు మొక్కలు నాటి ఫోటోలు తీయించుకుని పత్రికలకు పంపారు. కాలం కాని కాలంలో నాటినందువల్ల వానిలో ఆట్టే బతకలేదుటకాని అవి ఫోటోల్లో నాయకుల ముఖారవిందాలతో సహా శాశ్వత కీర్తిని పొందాయనడానికి సందేహం లేదు. వాటి ఆత్మలకి శాంతి కలుగుగాక.

ఈమారైనా సరిగా బ్రతకాలంటే తొలకరిలో నాటడం మంచిది. కాబట్టి ఆషాఢస్య అన్నారు.

అయితే ఇదిమాత్రం నమ్మక మేమిటి? ఎంత అశోకచక్రవర్తి ధర్మసామ్రాజ్యాన్ని స్థాపిద్దామన్నా కాలం కూడిరావాలికదా. కావలసినప్పుడు వర్షాలురావు. అక్కర్లేనప్పుడు, అసలు కూడనప్పుడు, వరదలు పారిస్తూ ఉండె. సస్యవృద్ధికి ఆధారమైన దేవుడే సస్యభక్షణ చేస్తున్నాడు. వరుణ



దేవునికటాక్షం ఆంధ్రదేశంపైన రూక్షణంగా రెండుమార్లు పడింది. కరుణ వనదీ, కరువు దక్షిణాదివారిదీ అయింది. తొలకరిలో పడవలసిన చినుకు మలకరిలో పడిందంటే మరి కొన్నివేల మొక్కలకి శాంతిక్రియలు చేసుకోవలసి వస్తుందేమో.

పూర్వవైభవాన్ని పూర్తిగా పునరుద్ధరించాలంటే నిజానికి ఇది చాలదు. గాంధీగారు "గ్రామాలకు మళ్లండి" అన్నట్లు "అరణ్యాలకు మళ్లండి"అంటే బాగుంటుందేమో. భారతసంస్కృతి అక్కడే పుట్టి పెరిగి మరిగింది. అరణ్యాలు కొట్టెయ్యడంతో మన సభ్యత హరించిపోవడం ఆరంభించిందిట. మహర్షులకు ఆత్మజ్ఞానోదయం అరణ్యాల్లోనే కలిగింది. విద్యాప్రచారం గురుకులాల ద్వారా అరణ్యాల్లోనే ప్రచారమయింది. ఆనాడు నాయికలు చెట్లనీ పుట్లనీ పట్టుకుని సాక్ష్యాలు చెప్పమని ఘోషించేవారు. వాల్మీకి పుట్టలో కూచుని రెండు కళ్లు మిటకరించి రామాయణ పుణ్యగాథని సాక్షాత్కరింప చేసుకున్నాడు. భారత భాగవతాది పురాణకర్త వేదవ్యాసుని జననానికి అరణ్యశృంగారమే హేతువయింది. సకలసద్గుణ సంపన్నుడైన శ్రీరామచంద్రుని లంకావిజయానికి అరణ్యవాసులే కారకులైనారు.

కాబట్టి మనసంస్కృతి, సభ్యత, మళ్లీ మూడుపువ్వులూ ఆరుకాయలుగా శోభించాలంటే మనం తిరిగి కిష్కింధాకాండలో ప్రవేశించాలి.

ప్రవేశించే ఉన్నాం. అంతే కాదు. వారి తలదన్నాం. కావలిస్తే చూడండి కాంగ్రెస్ పంచాయతీ ఎన్నికల్ని. మావూళ్లో కనీసం వారానికొకసారన్నా వచ్చి రెండు మూడురోజులు ప్రత్యక్షపురాణ ప్రదర్శన మిచ్చిపోతుంటాయి కోతులు. వీటిని కొండముచ్చులంటారు. కాని ఇవి కొండల్లో ఉండవు. కొంపలమీదా అడవుల్లోనూ ఉంటాయి. బహుశా అవి కొండల్లో ఉన్న రోజుల్లో ఆహారం అభావమై ఏమహాపురుషుడో "మళ్లండోయ్ మన వనవాసానికి" అని ఉంటాడు. దాంతో అవివసాలకీ ఊళ్లమీదికీ ఎగబడిఉంటాయి. ఆకొండముచ్చులు ఇళ్ళమీదనే లంకాయుద్ధం సాగించి ఇంటిమీదపెంకులు తిరగేసి, దొడ్లో ఏమన్నా పాగులు మొక్కలూ ఒకటీ అరా ఉంటే దుంపనాశనం చేసి చక్కాపోతాయి అప్పుడప్పుడు బెల్లపు అచ్చులూ, చింతపండముద్దలూ

(38-వ పేజీ చూడుడు)

# మధురక్షణాలు

(7 వ పేజీ తరవాయి)

ఎలాగని పరిశోధిస్తారు. అయితే అన్నిటికీ మించిన ఒక పెద్దభ్రమ కుస్త్రీలు దంసులు. దుస్తులూ ఆభరణాల సహాయంతో సౌందర్యాన్ని తెచ్చుకోవచ్చుననీ లోకుల్ని సమ్మోహింపచెయ్యవచ్చుననీ వారి భావన. మాయామోహపరికల్పితమైన జీవితానికి దుస్తులూ ఆభరణాలే ఆధారమని వారి భ్రమ. ఈభ్రమని కనిపెట్టడంకంటె అధికానందం మరేదీలేదని నా అభిప్రాయం.

ప్రపంచం ఎంత చిన్నది! ఇది చిన్నదని గ్రహించడం ఒక ఆనందం. బస్‌లో ప్రయాణంచేస్తుంటే ప్రక్కనున్న పెద్దమనిషితో మాట కలుస్తుంది. ఎక్కడో దూరాన ఉన్న నాతమ్ముడికి అతని కొడుకు మిత్రుడని తెలుస్తుంది. అప్పుడు దూరదేశం ఎంత సన్నిహితంగా గోచరిస్తుంది! లేక కొత్త ఊరిలో పాత మిత్రుని హఠాత్తుగా చూస్తాం. అదీ కాకపోతే దిక్కూదారీ తెలియని పెద్ద పట్నంలో బజార్లో అకస్మాత్తుగా మిత్రుడు కనిపిస్తాడు. వెంటనే ఆకొత్త ఊరు లేక ఆ పెద్ద పట్నం చిరపరిచితమై పోతుంది. హృదయంలో పేరుకున్న భీతి, వెయ్యిమందిమధ్య తిరుగుతూకూడా అనుభవించే ఒంటరితనం, ఈ పరిచయభావంతో పటాపంచలై పోతుంది. లోకమంతా అంధకారావృతమైనదే. సైబీరియా, అమెరికా, యూరప్ మొదలైన దేశాలన్నీ రాత్రి తెరకావల ఎక్కడో ఉన్నాయి. ధ్రువప్రాంతాల సముద్రఘోషలూ, దూరదేశాల తుపాకిమోతలూ మనకు వినరావు కాని కనీ వినని విషయాలు పరిచయభావంతో అత్యంత సన్నిహితాలైపోతాయి. నిజానికి లోకం ఎంత చిన్నది!

ఒకనాడు సాయంసంధ్యలో ఒక అరణ్యంలోకి వెళ్లాను. నేనునడిచిన దారి అంతా పొదలు, చెట్లు, తీగలు, ఆకులు ఎండు కొమ్మలు, ముళ్లకంపలతో నిండివుంది. అంతా నిశ్శబ్దంగా, మనుషులకు బహుదూరంగా ఉంది. నీరెండ చెరిగిపోతోంది. ఏదోపిట్ట సమీపంగా కూస్తూ ఎగిరిపోయి, తనవెంట గాఢనిశ్శబ్దవాతావరణాన్ని సృష్టించి వెళ్లింది. ఇక్కడ నేపీల్చిన గాలి వేరు. ఇక్కడ వాతావరణం వేరు. పురాతనకాల వాసనలు వెదజల్లుతోంది. ఆనేకశతాబ్దాలు నా ఊహాభావాన్ని భారతరం చేశాయి. భావనాగణం వెనుకద్వారాలు మెల్లిగా తెరుచుకొన్నాయి. పూర్వపురుషుల పురాతనతరాల యోచనలతో నా ఊహ యుగాల నధిగమించి ఎగిరి వెడుతోంది. అపూర్వపురుషులు నా చెవుల్లో గుసగుస లాడుతున్నట్లు ఈ సంధ్యా తిమిరంలో వేలు చూపుతున్నట్లు అనిపించింది. ఎక్కడ ఏ మళుపుద్దనో పూర్వులు వసించి రాక్షసులతో మృగాలతో ప్రకృతితో పోరు సలిపిన గహ్వరాలకు చేరగలనేమో. ఏ శంఖధ్వనో వినవచ్చి వర్తమానకాలాన్ని విస్మృతింపచేయవచ్చును. ఈ వృక్షాగ్రాలలో విహంగవాసాలలో ఈపుట్టల్లో, గుహలలో యుగయుగాల గాథలు సాలిపురుగు దారాలలో ఈగ వలె నన్ను బంధించవచ్చును. క్షణక్షణానికీ నాలోని అహంభావం చైతన్యము ఈ భావనాలో కొన్ని అపహాస్యం చేస్తూనే ఉన్నాయి. కాని చివరికి నాలోని పరమచైతన్యం, యుగవిస్మృతజీవభావంలోని తురీయచైతన్యంలో లీనమై మానవప్రకృతిలోని సత్యమైన పరిమళాన్ని ఆఘ్రాణించగలిగాను. దీర్ఘయుగాలలో వసించిన అనుభూతిలో కొన్ని క్షణాలు ఆవాయువు పీల్చి పరవశుడైనాను.

పల్లెల్లోనూ, చిన్న బస్తీలలోనూ బజారుకి వెళ్లడం ఒక చిత్రమైన అనుభవం. పెద్దనగరాల్లో వస్తువులు కొనడంలో విశేషం లేదు. అనవసరమైనా చిత్రమైన వస్తువుల్ని కొనవచ్చును. కొన్ని రెండుమూడురోజుల వరకూ ఈవస్తువులపై అపారమైన ఆదరం ఏర్పడుతుంది. ఎవరైనా వంకరలు పెడితే కోపంకూడా వస్తుంది. ధనాన్ని వెచ్చించడం అంటే ఈరోజుల్లో ప్రతిమనిషికీ సహజస్వభావమయింది. ఏవీ కొనుక్కోనవసరం లేకుండా ఉచితంగా రేషనులు తీసుకోవాలని చెప్పే కమ్యూనిస్టులకు ఇందులోని ఆనందం అసలేమీ తెలియదు. రకరకాల వస్తువులు ముందరపడవేస్తే పసిపాప ఆనందం అపారం. నగరాల్లో బజారుకెళ్లి పెన్సిల్ కొనడానికి వందరకాలమధ్య ఏరుకోవాలి. పల్లెలో అయితే కావలసిన వస్తువులన్నీ ఒకేచోట దొరుకుతాయి. అన్నిరకాలవస్తువులూ పోగుగా వున్నప్పుడు అందులో కావలసిన రకాల్ని ఏరి తీసికొనడం ప్రత్యేకం ఒక సరదా.

ఇంట్లోసందడి: ఇది అట్టే వివరంగా వర్ణించడం కష్టంకాని అందరికీ అనుభవమే. సందడికి సంసారం పెద్దదిగా ఉండాలి. హాస్యంలో ఎవరికీ విశేషప్రజ్ఞ ఉండాలని లేదు. నవ్వుకోడానికి పేలడానికి ఏమాటైనా సరే, ఏవిషయమైనాసరే పనికివస్తుంది. ఆరంభించడమే తరువాయి, భోజనాలవద్దనో, మధ్యాహ్నం విశ్రాంతి సమయంలోనో, రాత్రి నిద్రకు ముందో, ఏదోమాట వస్తుంది. లేకఏదో ఎవరికో జ్ఞప్తికి వస్తుంది. దాంతో ఇంటి పెంకులు ఎగిరిపోయేటట్లు అందరూ పకపకానవ్వుతారు. వేళాకోళాలు చెరిగేస్తారు. పిల్లల బుగ్గ లెర్రబడతాయి. అందరికీ కళ్లు తడౌతాయి. నవ్వుల్లో చేరకుండా పైనుంచి చూసేవారికి అసహ్యంకూడా పుట్టవచ్చును. కాని అందులో చేరితే ఎవరైనాసరే అందరితో సమానమౌతారు. ఆసమయంలో వారిలోని చిలిపితనం కోతిచేష్టలు బయటపడతాయి. హద్దులు మీరి విచ్చలవిడిగా ప్రవర్తిస్తారు. ఆక్షణంలో సాంసారికబాధలు దుఃఖాలు మటుమాయమైపోతాయి. ఆసన్నిహితభావం, ఆచనువు వుంటేగాని ఆసంసారంలో ఆక్షణికానందమైనా లభించదు. లభించినప్పుడు అందరూ సమానంగా అకృత్రిమానందాన్ని రీతిహేతువుల్తో నిమిత్తం లేకుండా అనుభవిస్తారు.

మృత్యువు ఆసన్నమైనప్పుడు మనం శాశ్వతనిద్రలో మునిగిపోతాం. లేదా ఏదో మరొక జన్మలో ప్రవేశిస్తాం. అనేకసంవత్సరాలుగా ఆ అంతిమ క్షణ మాసన్నమైనదనే భావం నాలో విచిత్రమైన ఆనందానుభూతిని కల్పించింది. చైతన్యం క్రమ క్రమంగా క్షీణించి గాఢసుషుప్తి పొందడం ఎంతటి అద్భుతానుభవమో! ఆతరువాత ఏదో నూతనజన్మ లభిస్తుంది. కొత్తగా జీవితాన్ని ప్రారంభించి కొత్తరూపం కల్పించుకోవచ్చును. ఆ ప్రభాతం వెనుక ఏదో మాయ, అజ్ఞాతజీవనం నిరీక్షిస్తోందనే భావం నాలో అలౌకికం అస్పష్టమైన ఆనందాన్ని చేకూర్చుతున్నది. నేను స్వర్గప్రాప్తికి తగిన పుణ్యం చేసుకోలేదు. నరకప్రాప్తికి అంతపాపమూ చెయ్యలేదు. కాబట్టి స్వర్గనరకాలకు మధ్య ఏ లోకంలోనో నా ఉత్తర జన్మ బాగానే వెళ్లిపోవచ్చును. అటువంటిదానికి భయం అనవసరం. కాబట్టి మృత్యువంటే నా కంత భయం లేదు. కాని ఆమలుపువద్ద ఆతెరవెనుక ఏమున్నదో తెలియనిభావమే కుతూహలం కలిగిస్తోంది. జన్మవాసనే ఆనందం చేకూర్చగలుగుతోంది.

# నేటి ప్రపంచం

## నెహ్రూ తూర్పు ఆసియా పర్యటన

పండిట్ నెహ్రూ ఇండోనీషియా సంచారం ముగించుకొని మలయా బర్మాలకు బయలుదేరివెళ్ళారు. గాంధీమహాత్ముని అహింసాసందేశాన్ని తూర్పు ఆసియాలో ప్రచారంచేసి, ఆసియా దేశాలలో సామ్రాజ్యవాదానికి అవసానదశ ఆసన్నమైనదని తెలిపారు. ఆసియా దేశాలు ఇటు వ్యాపారస్వేచ్ఛావిధానాన్నిగాని అటు సోషలిజంవిధానాన్నిగాని తుచ తప్పకుండా అనుసరించడం అసాధ్యమనీ, ఏ దేశస్థితికి అనువైనట్లు ఆ దేశం ఆరీతిగా కార్యక్రమాలు నిర్ణయించుకోవాలనీ తెలియపరిచారు.

ఆసియాలో ద్వితీయప్రపంచసంగ్రామానంతరం ఫిలిప్పైన్స్, బర్మా, భారతదేశం, పాకిస్తాన్, సింహళం, ఇండోనీషియాలకు రాజకీయస్వాతంత్ర్యం లభించింది. మిగతా మలయా, ఇండోచీనా మొదలైన ప్రాంతాలలో పాశ్చాత్యపాలకుల ప్రాబల్యం క్రమంగా క్షీణించిపోతోంది. ఈదేశాలకు కూడా రాజకీయస్వాతంత్ర్యం త్వరలోనే ఎప్పుడో ఒకప్పుడు లభించి తీరుతుంది. యూరోపియన్ పరిపాలకులకెంత అనిష్టమైనాసరే వారి ప్రాబల్యం అంతర్ధానంకాక తప్పదు.

అయితే ఇప్పటికి జాతీయస్వాతంత్ర్యం పొందిన దేశాలు ఇంకా ఆర్థికంగా అమెరికా యూరప్‌లపైనే చాలవరకు ఆధారపడి ఉన్నాయి. యూరప్ దేశాల ఆర్థికవ్యవస్థ కూడా ఈదేశాల స్నేహసహకారాలపైనే ఆధారపడిఉంది. కాబట్టి ఒక విధంగా ఇప్పటికి ఉభయవర్గాలమధ్యనూ మైత్రి సహకారాలు సక్రమంగా కొనసాగుతున్నాయి. కాని ఈపరస్పరసహకారాన్ని చిరస్థాయిగా నెలకొల్పడానికిగాను యూరోపియన్ దేశాలు అక్రమంగా కూడా వ్యవహరిస్తూ, తమ ప్రాబల్యాన్ని వృద్ధిచేసుకోడానికి యత్నిస్తున్నాయి. ఒకవంక పాశ్చాత్యులీ విధంగా వ్యాపారపారిశ్రామికాదిరంగాలలో ఆసియా దేశాల ప్రజల క్షేమాన్ని కూడా యోచించకుండా ఒత్తిడి తెస్తూ ఉండగా, రెండోవంక కమ్యూనిస్టు పార్టీలు ఆర్థిక విధ్వంసకకార్యక్రమాల్ని అనుసరిస్తూ, జాతీయప్రభుత్వాలకి ముప్పు తెచ్చిపెడుతున్నాయి. ఈరీతిగా ఆసియా దేశాలు ప్రబలవ్యాపారవర్గం, కమ్యూనిస్టు జాతీయవర్గాల సంఘర్షణకు రంగాలైనాయి. ఈసంఘర్షణలో వివిధవర్గాలు వివిధ విధానాల్ని సాధనాల్ని ఉపయోగిస్తున్నాయి. మొదటి రెండు వర్గాలూ ప్రపంచమంతటా జరుపుతున్న సంఘర్షణవిధానాన్నే ఇక్కడా అనుసరిస్తున్నాయి. ఇవి పాశ్చాత్యరాజనీతితంత్రజ్ఞతకే అనుకరణాలు. కమ్యూనిస్టువర్గం మార్క్సిస్టు-లెనినిస్టు స్టాలినిస్టు పంథాని అనుసరించడంలో ఆయా దేశాల పరిస్థితుల కనుగుణంగా కూడా తమ తంత్రాల్ని అనువర్తింపచేస్తున్నది.



ఆంగ్లో—అమెరికన్ వర్గంమాత్రం వర్తకపారిశ్రామికప్రాబల్యంతోనే, అనగా ఉభయ ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో యూరోపియన్లు అనుసరించిన విధానాన్నే అనుసరించి ఆసియా జాతీయప్రభుత్వాల్ని తమఅదుపులోకి తెచ్చుకోడానికి ప్రయత్నిస్తున్నాయి.

ఈ పరిస్థితిలో మూడోవర్గమైన జాతీయ రాజకీయపక్షవర్గం ఏ విధానాన్ని అనుసరించాలో తెలియక ఏ దేశానికాదేశం తాత్కాలికంగా పాశ్చాత్యులపైనే ఆర్థికాభివృద్ధికి ఆధారపడుతూ రాజకీయస్వాతంత్ర్యాన్ని కాపాడుకుంటూ, విధ్వంసకచర్యలనుసరించేవారిని అణచడానికి యత్నిస్తున్నాయి. నిర్భరదారిద్ర్యంలో మునిగిఉన్న ప్రజల్ని ఉద్ధరించడానికి ప్రాణాలొడ్డి కృషిచేస్తున్నా తెన్ను కనిపించడం లేదు.

ఉభయ ప్రపంచసంగ్రామాల మధ్య కాలంలో జపాన్ ఈ సమస్యనే పరిష్కరించడానికి పూనుకున్నది. కాని ఈ కార్యంలో పాశ్చాత్యుల వ్యాపారరాజకీయ దుర్నీతినే జపాన్ అనుసరించినందువల్ల అటు పాశ్చాత్యులు వీగిపోయినప్పటికీ, ఇటు ఆసియావాసుల స్నేహాదరాలను కోలుపోయింది. ఆర్థికపునరుద్ధరణకార్యక్రమంలో ఈనాటికీ జపాన్ అనుసరించిన కార్యక్రమమే ఆసియావాసులకు ఆచరణీయమని తోచకమానదు. మొదట కుటీరపరిశ్రమలు సేద్యాభివృద్ధి ద్వారా నిరుద్యోగాన్ని నిర్మూలించి, ఆపైన వస్తూత్పత్తిని వృద్ధిపరచడానికి భారీ పరిశ్రమల్ని నిర్మించారు. వీటన్నిటికంటె యంత్రపరికరాల ఉత్పత్తి ప్రధానంగా ఎంచి ప్రభుత్వం స్వయంగా కృషి చేసింది. చీనాలో కమ్యూనిస్టు ప్రభుత్వం స్థాపితమవగానే యంత్ర పరికరాల పరిశ్రమను వృద్ధిపరచడం అత్యంతప్రధానమని ప్రభుత్వంప్రకటించింది. ఆపైన కుటీరపరిశ్రమలకు వ్యవసాయాభివృద్ధికీకూడా జపాన్‌లో విద్యుచ్ఛక్తి విస్తారం వినియోగించబడింది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో భారీ హైడ్రోఎలక్ట్రిక్ ప్రాజెక్టులతో పాటు చిన్న ప్రాజెక్టులు జెనరేటర్లకు కూడా సమాన ప్రాధాన్యమిచ్చారు. జపాన్ పారిశ్రామికాభివృద్ధికి పాశ్చాత్యుల ఇంజనీర్లపైనా నిపుణులపైనా ఆధాంపడలేదు. యూరోపియన్ల దోపిడిని అరికట్టడానికిగాను విశాల ఆసియా ఉద్యమాన్ని జపాన్ ప్రారంభించింది. కాని ఈఉద్యమంకూడా క్రియలో అన్యదేశాలను దోచుకోవడమే అయింది.

తిరిగి ఇప్పుడు ఆసియాదేశాలు పాశ్చాత్యవ్యాపారులు కమ్యూనిస్టులబారినుంచి కాపాడుకుని దేశీయార్థికాభివృద్ధికి పాటుపడవలసిన ఆగత్యం కలిగింది. జపాన్‌వలె ఆర్థికసముద్ధరణకు అవకాశమున్నప్పటికీ మన దేశాలు పాశ్చాత్యనిపుణులపైనే ఇప్పుడు ఆధారపడుతున్నాయి. ఆసియాదేశాలలో అమెరికన్లు పెట్టుబడి పెట్టడానికి జంకుతున్న

ఈ తరుణంలోనే ఆసియా దేశాలు పరస్పరం సహాయపడి ఆర్థికసమద్ధరణకు పాటుపడ్డానికీ, దేశీయార్థికవర్గాలవారు దేశీయపరిశ్రమల నభివృద్ధిపరచడానికీ అపూర్వమైన అవకాశం ఉంది.

ఆసియా దేశాలు అన్యవర్గాలను నిరోధించడంలో పరస్పరసహకారం సాధించడానికీ, అంతర్జాతీయవ్యవహారాల్లో ఒకే విధానాన్ని అనుసరించడానికీ కల ఈ అవకాశాన్ని పురస్కరించుకుని పండిట్ నెహ్రూ తూర్పుఆసియాపర్యటన చేశారు. ఆసియా దేశాలకు పండిట్ నెహ్రూ విదేశాంగ విధానంపట్లను ఆంతరంగిక కార్యక్రమవిధానం పట్లనూ ప్రబలవిశ్వాసం ఏర్పడింది. ఏవ్యవహారంలో కాని హింసాప్రవృత్తి పరిత్యాజ్యమనీ, నీతిసత్యాలకు కట్టుబడి వ్యవహరించని పక్షంలో సత్ఫలితాలు కలుగవనీ పండిట్ నెహ్రూ చేసిన ఉద్బోధ ఆసియా రాజకీయవర్గాలకేగాక ప్రజలకు కూడా అంగీకారయోగ్యమయింది. ఆర్థికవ్యాపారరాజకీయాదిరంగాలలో ఆసియా దేశాలమధ్య సహాయసహకారాల్ని పెంపొందించడానికి ఈపర్యటన సహాయభూతమౌతున్నది. [సూర్యనారాయణ]

---

# వనమహోత్సవం

(35-వ పేజీ తరువాయి)

అద్దాలూ ఎత్తుకుపోతాయి ఒక కోతి ఇంటికప్పెక్కి కూచుని అద్దంలో చూసుకుంది. పక్కనే ఇంకో కోతి వచ్చి పక్కనుంచి తొంగిచూసింది. అంతవరకూ స్నేహంగా ఉన్నవల్లా రెండూ కీచులాడ్డం మొదలెట్టాయి--భర్తకోసం కొందరు సవతుల్లాగా. అద్దంమాత్రం మళ్లీ అందలేదు.

మానరాజకీయాలు సరిగ్గా ఇలానే ఉన్నాయి. ముందు సంపాదించిన త్యాగఫలాన్ని బుగ్గనంచీల్లో పెట్టుకుని కాంగ్రెస్ వారు, మూల్తున్నారు అందులో తగువులొస్తే ఊరంతా చూస్తున్నారనైనా లజ్జపడకుండా కొట్లాడుకుంటున్నారు. ఒకరికొకరు లోకగత్తుకుపోతారు. ఒకరికందిన ఫలాన్ని వారి నోటనుంచి పడగొట్టడానికి తరిమితరిమి పట్టుకొంటారు. ఎంగిలి ముక్కలైనాసరే అందుకుని స్వాహా అంటారు. గుంపుకంతకీ నాయకుడొక్కడే ఉంటాడు. మిగతా పాతికమున్నైమంది నాయిక లుంటారు. ఈ నాయకలందర్నీ ఏలే నాయకుని పొందుకోసం నాయికలందరూ ఊళ్లూ దేశాలూ పరవళ్లెత్తి పోరాడతారు. అంటే మన రాజకీయాలు ఏనాడో కిష్కింధావాసానికి చేరాయన్నమాట.

స్వాతంత్ర్యం అంటే అదే కాబోలు. కోతుల కున్న స్వేచ్ఛ మనుషుల కేదీ? కోతులైతే చిత్తం వచ్చినచోటికి వెళ్లగలవు. కడుపారా ఆకూ అలం తినగలవు. మనసారా కిచకిచమంటాయి. ఆడతాయి. అడ్డేవాళ్లు లేరు (వెళ్లగొట్టేవాళ్లేకాని).

మళ్లీ మనకి ఆస్వేచ్ఛ, స్వచ్ఛందానుభూతి లభించాలంటే ఆకూ అలం తినడం అవసరమేమో! వాళ్లల్లో మొక్కలు నాటి ఇదే నందనవనం బృందావనం అనుకోవడానికి దారిలేదు. అరణ్యవాసం బృందావనవిహారాలు తిరిగి ప్రత్యక్షం చేసుకోవడానికి లేదు. అక్కడక్కడ గ్రామాల్లో స్వాములవార్లుచేరి రాసక్రీడలు చంద్రికా వనవిహారాలు పునరావృత్తి చెయ్యవచ్చును కాని అవి ఆట్టేదూరం పోతే స్వాములవార్లకికూడా ఎముకలు పిండిగాకుండా కాపాడుకోడం కష్టం.

అయితే మార్గాంతరం లేకపోలేదు. పురాణయుగం నాటి మన పూర్వులు కందమూలాదులు భుజించి అనుపమానమైన తేజోయశస్సంపదల నార్జించారు. బ్రహ్మజ్ఞానం పొందారు. ఈరేషన్ రోజుల్లో ఏ ఆకూ అలమూ కూడా తినకపోతే అనతికాలంలోనే మనిషికి బ్రహ్మైక్యం తథ్యం. ఆవారంరోజులూ అన్నం రొట్టె త్యజించి పళ్లు ఫలాలు దుంపలు వగైరా తిని ఉండాలని మునీశ్వరన్నారు. ఆవారంరోజుల రేషన్ బియ్యం, గోధుమ గాని ఇంట్లో నిలవ వేసుకోవచ్చు. ఇళ్ళలో దూరి తనిఖీ చేసే అధికార్లకి ఇది బ్లాక్ మార్కెట్ బియ్యం కాదని రుజువుచేసుకోడానికి మాత్రం సిద్ధంగా ఉండాలి. లేదా నిలవవేసుకో నివ్వాలని ప్రభుత్వంచేత ఏకమొత్తాన్ని దేశం అంతకీ అనుమతి ఇప్పించాలి. అప్పుడు ఆ స్వప్నసుఖానుభవం పరంపరనాసిద్ధిస్తుంది

మరి అద్దె కొంపలవాళ్లేం చెయ్యాలి? బస్తీల్లో మొక్కలు నాటుకోడానికి జాగాలేకపోతే కుండీల్లో పెట్టుకోవచ్చును. చెన్నపట్నంలో ఈ కుండీలు ఎత్తుకుపోయే దొంగలు కూడా ఉన్నారని ఈమధ్యనే తెలిసివచ్చింది. అటువంటప్పుడు కుండీలు వంటఇంట్లో పెట్టుకోవచ్చును. సూర్యరశ్మి తగలని కూపాలలో ఉండే లక్షలాది జనం పొరుగిళ్లలో మహోత్సవాన్ని చూసి ఆనందించవచ్చును. మహోత్సవంలో పాల్గొనేవాళ్లు అంటుమొక్కల కొనడంలో జాగ్రత్తపడాలి. మల్లి అంటు అని చెప్పి మరేదో మొక్కలమ్మేవాళ్లున్నట్టుగానే వృక్షాలతాలూకు మొక్కలని చెప్పి ఏ చిట్టిపొదల మొక్కలు అంటగట్టినా ఆశాభంగమే. ఆపైన నీళ్లు జాగ్రత్తగా ప్రతిపూటా పోసి పెంచాలి. ఇవి పెద్దవృక్షాలై మనఇంటికి చల్లదనం మనకి పచ్చదనం, మన ఊరుకి వర్షం మనదేశానికి భాగ్యం ఇచ్చే నాటికి కనీసం మనమనుమలైనా పెరిగి పెద్దవారై ఫలం అనుభవించడానికి సిద్ధం కాగలరు. ఆమొక్కా మనమూకూడా బ్రతికి బాగుంటే తోన్నినోటితో మనమలతో సహా మనం చూసి ఆనందించవచ్చును.

---

# రుద్రమదేవి

(11-వ పేజీ తరువాయి)

తలపడినాడు. దుర్యోధనుడో, భీముని భుజములు తన గదతో చితుకగొట్టి, యతని ప్రయత్నము విఫలముచేసి, చాతురీగతితో భీమునకు అందకుండగా చిత్రచిత్రగతులతో తిరుగుచు, గదాఘాతములతో నాతని నొప్పించుచున్నాడు గదాయుద్ధములో సుశిక్షితుడును అద్వితీయుడునుగదా రాజరాజు! అయినా, భీమసేనుడు మహాబలశాలి. అతనికా దెబ్బలు లెక్కా?"

"అడుగో, రాజరాజు భీమసేనుని తలమీద తన గదతో కొట్టినాడు. తల పగిలి, రక్తప్రవాహములో తడిసిపోయిన శరీరముతో సత్తువ తూలి, పాండవమధ్యముడు పిడుగు పడి, పగిలి, తగులబడి, స్రవించుచున్న ధాతువులతో మేరుపర్వతమువలె గుభాలున నేల గూలుచున్నాడు."

"అది చూచి వ్యాసుడు ముక్కున వ్రేలు వేసికొని దిగాలు పడి చూచుచు, అలా నిలబడిపోయినాడు!"

"ధర్మరాజు దిగులుపడి పొగిలిపోవుచున్నాడు. విదురుడు కన్నీరు పెట్టుచున్నాడు..."

మరి యీ గోదావరీపండితసామాజికులకుమాత్రము కన్నీరాగునా? ఆ పిమ్మట శ్రీకృష్ణుని సంజ్ఞగొని భీమసేనుడు లేని యోపిక తెచ్చుకొని తలపడుట వర్ణింపబడినది.

"భీమదుర్యోధనులకు మళ్ళీ గదాయుద్ధము ప్రారంభమయినది. అడుగో, భీమసేనుడు, అరచేతులు నేలపై రాచి తుడిచికొని, భుజము లప్పళించి, అవుడుగరచి, క్రోధోద్రేకముతో, బలము కొలది ప్రళయకాలాంబుదమువలె గర్జించి, దుర్యోధనునితో తలపడినాడు... ఆఁ ఆఁ, చూచినారా! అతడు ధర్మము విచారింపక, యుద్ధనీతి గోతిలో త్రోసివేసి, కృష్ణుని సంజ్ఞానుసారముగా గురిచూచి, గదతో రాజరాజుతొడలమీద కొట్టుచున్నాడు...

"అయ్యో! అయ్యో! కురురాజు తొడలు విరిగి నేల గూలినాడు!"

*    *    *

"కృష్ణద్వైపాయనుడు అదరి ఎగిరిపడినాడు!"

ఆపిమ్మట హలాయుధుని కోపమును, పాండవులు భీమసేనుని పొదివి యావలికి తీసికొనిపోవుటయు వర్ణింపబడినది. ఈ విష్కంభము పూర్తియగునప్పటికి సామాజికులకందరకు ఒక్కసారిగా అభిమానము దుర్యోధనుని పక్షమునకు మరలినది.

మరల ప్రదర్శనము ప్రారంభించినది. భీముని వక్షస్థలము తన నాగలితో దున్నివేయ నుంకించు బలరాముని రాజరాజే, "పూజ్యుడా, హలాయుధుడా! శాంతించు! శాంతించు!" మనుటతో నా యభిమానము బలమైనది. ఆపిమ్మట దుర్యోధనబలరాముల సంభాషణముసాగుటతో నది యతిశయించినది. ఆ తర్వాత దుర్యోధనుని రణరంగములో వెదకికొనుచు ధృతరాష్ట్రుడును, గాంధారియు, రాజమహిషులగు పౌరవియు మాలవియు, కుమారుడగు దుర్జయుడును ప్రవేశించి నాటకము సాగునప్పటికి సామాజికుల కందరకు నిర్వేదమావహించినది. వారికీ నాటకమున రసమేమో ఆలోచన లేదు. ఇందు నాయకు డెవరో ప్రతినాయకు డెవరో ఆలోచన లేదు.

"ధృతరాష్ట్రుడు: కుమారా, రా! కన్నతండ్రిని, ఒక్కమారు నాకు అభివాదనము చేయి!"

"దుర్యోధనుడు ఇదిగో వచ్చుచున్నాను. [లేవబోయి లేవలేక పడిపోవును] అక్కటా! ఇది నాకు మరియొక దెబ్బ! దుర్భర దుర్గతి! భీమసేనుడు తన ఇనుపగదతో చితుకగొట్టి, నేలపై పడవేసి, జుట్టు పట్టుకొని యీడ్చినప్పుడే, తొడలతోపాటు, లేచి పితృపాదాభివందనముకూడా నాకు కానిదై పోయినది!"

ఆ మాటలతో సామాజికులు దుర్యోధనుని యకార్యము లన్నియు మరచి, యతని ధర్మిష్ఠతయందే బుద్ధి నిలుపసాగిరి. ఎంత పితృభక్తి ఇతనికి!

అంతట కుమారుడగు దుర్జయుడే, యా యంధకారములో దుర్యోధనుని గనుగొని, ఇంటికి రమ్మని కోరుచు, తొడలు విరిగినవని తెలియక ఆ పసివాడు ఆప్యాయముగా తండ్రిని తొడలమీద తన్ను కూర్చుండనిమ్మని తొడలపై నెక్కబోవును. ఈ సన్నివేశముతో సభలోనందరు నేకధారగా కన్నీరుగార్చిరి.

ధృతరాష్ట్రులతో సంభాషణలో దుర్యోధనుడు తల్లి నిట్లు ప్రార్థించును.

"వీరమాతా, నమస్కారపూర్వకముగా, నిన్ను ప్రార్థించుచున్నానమ్మా!—ఏ లవలేశమైనా నేను పుణ్యముచేసికొని ఉన్నచో, జన్మాంతరములోగూడ నీవే నా జననివి అగుదువుగాక!"

ఏమి యితని మాతృభక్తి! సభ్యులందరు దుర్యోధనుని పక్షమే యైరి. ఈ రూపకమునకు నాయకుడే దుర్యోధనుడా? భీమసేనుడే ప్రతినాయకుడా? శ్రీకృష్ణుడే ప్రతినాయకుడా? మన మెరిగిన నాటకలక్షణము లన్నియు తారుమారగుచున్నవి. ఏమైనను ఈ ప్రయోగము హృదయస్పర్శిగా నున్నది!

తుదకు అశ్వత్థామ ప్రవేశించెను. ప్రవేశించుచునే అతడిట్లనెను:

"సజ్జమైన కార్ముకముతో దుర్యోధనమహారాజు ప్రారంభించిన యుద్ధయజ్ఞమును, అద్వితీయుడు అశ్వమేధమునువలె మరల నేనుపక్రమించి, తుదముట్టింపబోవుచున్నాను."

*    *    *

"మా పితృపాదులకు తిలతర్పణ మిచ్చుకొనుచు, నేను దూరముగా నున్న సమయములో, శత్రువులు కుహుకులతిలకులైన దుర్యోధనుని వంచించి కూల్చివేసినారు...

"ఇప్పుడీ దుర్యోధనమహారాజు అస్తగిరిశిఖరాగ్రభాగము మీదనుండి క్రమ్ముకొన్న సంధ్యారాగముతో పశ్చిమసూర్యునివలె నస్తమింపబోవుచున్నాడు!"

చివర కాతడిట్లనెను:

"దుర్జయ! ఇతస్తావత్,

"పితృవిక్రమదాయాద్యే రాజ్యే భుజబలార్జితే
వినాభిషేకం రాజా త్వం విప్రోక్తైర్వచనైర్భవ!"

ఇంతవరకును గోదావరిపండితులు రూపకరసాకృష్టులై, మహాప్రవాహములోవలె కొట్టుకొనిపోవుచుండిరి. కాని యీ యశ్వత్థామవాక్యములతో నందరికి ఆశ్చర్య మైనది. తట్టిలేపినట్లు ఒక్కసారిగా వారి చిత్తము లుద్బుద్ధము లైనవి. ఎవ డీ దుర్జయుడు? అభిషేకము లేకుండ బ్రాహ్మణవాక్యము ప్రసరించుటేమి? దురభిమానమోహితులైన యశ్వత్థామవంటి బ్రాహ్మణుల వాక్యములకు పటుత్వ ముండునా?

ఇట్లు వారు ఆలోచించుచుండగనే సరిగా, దుర్యోధనుడు చివరి వాక్యములు ప్రారంభిలచి సాగించుచుండెను.

"...ఊర్వశ్యాదయోఽప్సరసో మా మభిగతాః. ఇమే మహార్ణవా మూర్తిమంతః. ఏతా గంగాప్రభృతయో మహానద్యః ఏష సహస్రహంసప్రయుక్తో మాం నేతుం వీరవాహీ విమానః కాలేన ప్రేషితః. అయ మయ మాగచ్ఛామి!"

స్వర్గగతు డయ్యెను!

ఈ మాటలు పాడుచుండగనే, గోదావరిపండితులలో క్షణ క్షణము కలవరపాటు వృద్ధిపొందసాగెను. 'రంగముమీదనే మరణము ప్రదర్శించెదరా, ఏమి!— అయ్యో! రంగముమీదనే?—' అనుచు, వారు తత్తరముతో తమ కొమ్ముచెంబులు చేతులతో నందుకొనుచు లేచుచుండిరి.

దుర్యోధనుని స్వర్గప్రయాణము ప్రదర్శింపనే ప్రదర్శింపబడెను. గోదావరిపండితులలో హాహాకారములే ఒక్కసారిగా పుట్టి నేల యురిఖినట్లు ఆ సభామధ్యమును దడదడలాడించెను.

---

# మన ఆహారసమస్య

(18-వ పేజీ తిరువాయి)

ఆర్టికిలును అమలుపర్చి ఆహారవ్యవసాయ సహకార నిర్మాణశాఖలను విలీనీకరించి కేంద్రప్రణాళిక నమలుపర్చితేనే గాని మన ఆహారప్రపంచమునందు యేర్పడిన అశాంతి తగ్గదు. సత్వరఫలోదయమునకు అవకాశ ముండదు.

ఇంతేగాక మనరాజ్యాంగచట్టము 4 వ అధ్యాయములో పరిపాలనయొక్క ఆశయములు వివరింపబడియున్నవి. ప్రజల కొనుగోలుశక్తి నభివృదిపరచుటను గురించి 47 వ ఆర్టికలులో వివరింపబడినది 48 వ ఆర్టికలులో వ్యవసాయపశుసంపదల నభివృద్ధిపరచుటను గూర్చి వివరింపబడియున్నది. ఈ ఆశయముల సత్వరసాధననిమిత్తమున్నూ దేశసంపద నభివృద్ధిపరచుటకున్నూ, సర్వజనసామరస్యముకొరకున్నూ, సత్వరఫలసాధనకున్నూ పైశాఖల విలీనీకరణయున్నూ కేంద్రపరిపాలనయున్నూ ముఖ్యఅవసరములై యున్నవి.

కేంద్ర ఆహారశాఖకు శ్రీ కె. యమ్ మున్షీ అధ్యక్షు డైనాడు. మున్షీ కవి, రచయిత, సుప్రసిద్ధన్యాయవాది, విజ్ఞానఖని. బొంబాయి రాష్ట్రీయ తృణశాఖామంత్రిగా లోగడ తనపరిపాలనావైదుష్యాన్ని ప్రదర్శించినాడు. హైద్రాబాదులో మున్షీ జయప్రదంగా చేసిన మంత్రాంగంద్వారా తనబుద్ధివిశేషాన్నీ చతురతనూ రుజువుపర్చినాడు. అచిరకాలంలోనే మున్షీ అధ్వర్యాన ఆహారసమస్య తృప్తికరంగా పరిష్కారమగునని ఆశ.

పదవిని స్వీకరించిన వెంటనే మున్షీ బొంబాయిలో జరిగిన ఆహారవిషయకమైన సభను ప్రారంభిస్తూనున్నూ, అటుపిమ్మట వర్తకసంఘం చేసిన విందులోనున్నూ ఆహారసమస్యాపరిష్కారానికి తన అష్టాంగప్రణాళికను వివరించినాడు. మరిన్ని ఆహారశాఖలో యింతవరకూ సాధించిన ఫలములు చాలా అసంతృప్తికరము లన్నాడు. రాజకీయవేత్తయైన మంత్రికిన్నీ, ఉద్యోగులకున్నూ మధ్య అన్యోన్యసహకారం కనపడుట లేదన్నాడు. పరిపాలకులకున్నూ, ప్రజలకున్నూ మధ్య ఆదరాభిమానములు ముఖ్యము లన్నాడు. మున్షీ అచిరకాలములోనే అసంతృప్తికరములైన పై పరిస్థితులను నిర్మూలించు నని ఆశ.

ప్రజలు ప్రభుత్వంతో సహకరించి ప్రభుత్వం అమలుపర్చే ప్రణాళికలకు దోహద మిస్తేనే గాని సత్వరవిజయసిద్ధికి అవకాశ ముండదు. ప్రస్తుతపరిస్థితులలో ప్రభుత్వము ఒంటరిగా "ప్రాజెక్టులు" నిర్మించుట కయ్యే ఖర్చు భరించుట దుర్లభము. పంటలకు హెచ్చుధర లుండుటవలనవ్యవసాయదార్ల ఆదాయంలో వుండే పరిస్థితు లేర్పడినవి. వ్యవసాయదార్లు తమతమ ఆదాయాలను ప్రభుత్వమునకు ఋణ మిచ్చి, వ్యవసాయాభివృద్ధికొరకు "ప్రాజెక్టులు" నిర్మించుటకు సహకరించినచో, ఋణ మిచ్చిన సొమ్ము వుత్తరోత్తరా వడ్డీతో తిరిగిరావడమే కాకుండా, పంటలు పండించటానికి ఆకాశంమీద ఆధారపడే దురవస్థకూడా తప్పిపోతుంది.

---

★

# బందరు సమీపంలో విమాన ప్రమాదం

గత గురువారం రాత్రి, బొంబాయినుంచి హైద్రాబాద్ కని ప్రత్యేకంగా బయలుదేరిన విమానం, త్రోవ తప్పి, గాలిలోనే ఐదుగంటలసేపు తిరుగుతూ పెట్రోలు ఐపోయినందున, బందరు చిలకలపూడి సమీపంలో నేలకు పడిపోయి తునాతునకలైపోయింది. పైలట్, మరొక ప్రయాణీకుడు వెంటనే మరణించారు. రేడియో ఆపరేటరు, ఆస్పత్రిలో చేర్చినాక చనిపోయాడు. మిగతావారు తేరుకొంటున్నారు. విమానప్రమాదం జరిగిన ప్రదేశం, ప్రమాదంలో గాయపడిన వ్యక్తులు, పడిపోయిన విమానభాగాలు, ప్రక్కపుటలోని చిత్రాలలో కానవగును.